# వీరిది ప్రత్యేక అనుబంధం!

స్టార్లూ, డైరెక్టర్లదీ విడదీయరాని బంధం. అయితే కొందరు స్టార్లకు కొందరు డైరెక్టర్లతో ప్రత్యేకమైన అనుబంధం ఉంటుంది. హిట్, ఫ్లాప్‌లను పట్టించుకోకుండా 'కంఫర్ట్'గా ఒకరితో మరొకరు పనిచేస్తారు. డేట్స్, ఇమేజ్ అనే పదాలు వారి మధ్య ఉండవు. ఆ 'కాంబినేషన్' కోసం ప్రేక్షకులు కూడా ఆసక్తిగా ఎదురుచూస్తుంటారు. అలాంటి కొన్ని ఆత్మీయ కాంబినేషన్లు మీ కోసం...

ఫిల్మ్‌నగర్

త్రివిక్రమ్‌ను పవన్‌కళ్యాణ్ ఒక దర్శకుడిగా కాకుండా మిత్రుడిగానే చూస్తారు. 2008లో 'జల్సా'తో మొదలై 'అత్తారింటికి దారేది'తో పీక్‌కు చేరింది వీరిద్దరి సాన్నిహిత్యం. పవన్‌ను తెరపై ఎలా చూపించాలో త్రివిక్రమ్‌కు బాగా తెలుసు. మిగతా దర్శకులతో ఎంత పెద్ద హిట్ ఇచ్చినా త్రివిక్రమ్ సినిమా అనగానే పవన్‌కళ్యాణ్ రిఫ్రెష్ అవుతారు. ప్రస్తుతం వీరిద్దరి కాంబినేషన్‌లో ముచ్చటగా మూడో చిత్రం రెడీ అవుతోంది.







ఇద్దరు తమిళ సూపర్‌స్టార్లకు హరి ఫేవరెట్ దర్శకుడు. విక్రమ్, సూర్యలను పవర్‌ఫుల్ పోలీస్ ఆఫీసర్లుగా చూపించడంలో ఆయనను మించినవారు లేరు. అందుకే దర్శకుడు హరి ఎప్పుడంటే అప్పుడు డేట్లు ఇచ్చేస్తుంటారు వాళ్లిద్దరు. సూర్యతో ఇప్పటికే మూడు 'సింగమ్'లు తీసిన హరి ప్రస్తుతం విక్రమ్‌తో పద్నాలుగేళ్ల తర్వాత రెండో 'సామి' తీస్తున్నాడు.



సరిగ్గా పదహారేళ్ల క్రితం ఎన్టీఆర్ 'స్టూడెంట్ నెం1'తో డైరెక్టర్‌గా జర్నీ ప్రారంభించిన ఎస్.ఎస్.రాజమౌళికి ఆయనంటే ప్రత్యేకమైన అభిమానం. రాజమౌళిని 'జక్కన్న' అని ప్రేమగా పిలుచుకునే ఎన్టీఆర్‌తో ఆ తర్వాత 'సింహాద్రి', 'యమదొంగ' వంటి సూపర్‌హిట్స్ ఇచ్చారు. వీరిద్దరి కాంబినేషన్‌లో 'యమదొంగ' వచ్చి పదేళ్లవుతోంది. అందుకే 'బాహుబలి' తర్వాత జక్కన్న తీయబోయే సినిమా కూడా ఎన్టీఆర్‌తోనే అనే వార్తలు ఇప్పటికే సోషల్ మీడియాలో చక్కర్లు కొడుతున్నాయి.



దర్శకుడు కబీర్‌ఖాన్ అంటే సల్మాన్‌ఖాన్‌కు ప్రత్యేకమైన అభిమానం. గతంలో రెండు 'ఈద్'లకు రెండు సూపర్‌హిట్స్ (ఏక్ థా టైగర్, బజరంగీ భాయిజాన్) సల్మాన్ ఖాతాలో జమచేసిన కబీర్‌ఖాన్ ముచ్చటగా మూడో 'ఈద్' హిట్‌కు రెడీ అయ్యాడు. వీరిద్దరి కాంబినేషన్‌లో సినిమా అనగానే అభిమానులు నిజంగానే పండగ చేసుకుంటారు. ఇదే నెలలో విడుదల కానున్న 'ట్యూబ్‌లైట్' కోసం అంతా ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు.



బాలీవుడ్‌లో రోహిత్‌శెట్టి, అజయ్‌దేవగన్‌లది విడదీయరాని బంధం. మాస్ సినిమాలు తీయడంలో దిట్టగా పేరు తెచ్చుకున్న దర్శకుడు రోహిత్ శెట్టి 2003 నుంచి ఇప్పటిదాకా తీసిన డజను సినిమాల్లో పది అజయ్‌దేవగన్‌తోనే చేయడం విశేషం. 'గోల్‌మాల్' సిరీస్‌లో మూడో భాగం 'గోల్‌మాల్ అగైన్' ప్రస్తుతం వీరిద్దరి కాంబినేషన్‌లో తెరకెక్కుతోంది.



# INSIDE





**వర్చువల్ రియాలిటీ**

వర్చువల్ రియాలిటీ - అద్భుతాల్ని ఆవిష్కరించనుంది. వైద్యం నుంచి టూరిజం దాకా అన్ని రంగాలకూ సాంకేతికమైన సొబగులు అద్దనుంది. 7



**రామాచారి**

ప్రస్తుతం వెండితెరపై, రియాలిటీ షోలలో పేరు తెచ్చుకుంటున్న ఎంతోమంది గాయనీ గాయకులు తొలుత గళం సవరించుకుంది రామాచారి దగ్గరే. 12

మీ అభిప్రాయాలను పోస్టు ద్వారా **ఆదివారం ఆంధ్రజ్యోతి**, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33కు, మెయిల్ ద్వారా sunday.aj@gmail.comకు పంపండి.



## మిత్రవాక్యం

'నా జీవితం తెరిచిన పుస్తకం'... అనడం సులభమే కానీ, ఆ తెరిచిన పుస్తకంలోనూ ఎన్నోకొన్ని పేజీలు అతుక్కుపోయి ఉంటాయి. ఓ పట్టాన తెరుచుకోవు. ప్రేమలూ ద్వేషాలూ, ఆస్తులూ అప్పులూ... ఇలా ప్రతి మనిషి కథలోనూ సగటున పదమూడు రహస్యాలు ఉంటాయనీ, వాటిలో మహా అయితే ఓ ఎనిమిదింటిని ఆత్మీయులతో పంచుకుంటాడనీ మిగతా ఐదు మాత్రం, చివరిదాకా రహస్యాల్లానే మిగిలిపోతాయనీ, ఆ మనిషితో పాటే అవీ మట్టిలో కలిసిపోతాయనీ తాజా అధ్యయనాలు చెబుతున్నాయి. రహస్యం పురుగు లాంటిది. మెదడును తొలిచేస్తూ ఉంటుంది. అదో కనిపించని గుదిబండ కూడా! ఒక్కో రహస్యం బరువు ఓ కిలో దాకా ఉంటుందని అనుకున్నా... ప్రతి మనిషీ తనకు తెలియకుండానే అన్నన్ని కిలోల బరువును మోస్తున్నాడన్న మాట! ఇదో పులి సవారీ లాంటి వ్యవహారం. ఎవరిముందైనా చెప్పుకుని బరువు దించుకోడానికి ధైర్యం సరిపోదు. మనసులోనే ముదగబెట్టుకోడానికి అంతరాత్మ ఒప్పుకోదు. రహస్యం అంటే, దాదాపుగా ఓ చీకటి పని! అసలు రహస్యాలే లేకుండా బతకడం అసాధ్యమైతే కావచ్చు కానీ, సాధ్యమైనంత పారదర్శకంగా నిజాయతీగా జీవించడం పెద్ద కష్టమేం కాదు. అలాంటి జీవితం... హాయిగా ఉంటుంది, తేలిగ్గా అనిపిస్తుంది. మానసిక ఆరోగ్యమూ బావుంటుంది. ■



## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### ◆ భలే వెటకారం

మినిమం బ్యాలెన్స్, సర్వీస్ చార్జీలు అంటూ బ్యాంకులు బాదుడు మొదలుపెట్టిన సమయంలో, 'సచ్చే దిన్ @ దిబ్బరాజ్యం' కథ సందర్భోచితంగా ఉంది. ఏటీఎంలు డబ్బులు రాక, ఎన్‌టీఎంలుగా మారయనీ, ఏసీ రిలాక్స్ సెంటర్ల అవతారం ఎత్తాయనీ రచయిత సంధించిన వ్యంగ్యాస్త్రం భలే పేలింది. నిజంగా ఇటువంటి పరిస్థితి వచ్చినా ఆశ్చర్యపోనక్కర్లేదేమో! చిరుద్యోగులు లోన్ తీసుకున్నా పాపం, తీసుకోకపోయినా పాపం. పొరపాటున మొత్తం కట్టేసినా పాపమే! అదే కోట్లకు కోట్లు ఎగనామం పెట్టే వారిని దేశభక్తులంటూ కీర్తించడం ఇక్కడ మాత్రమే కనిపించే అరుదైన దృశ్యం.

**- భవిత,** బెంగుళూరు

### ◆ ముఖచిత్ర కథనం బాగుంది !

ప్రాంతీయ సౌరభంతో, చారిత్రక ఘటనలతో గుదిగుచ్చిన ముఖచిత్ర కథనం ఎంతగానో అలరించింది. మన సంస్కృతీ సంప్రదాయాల గొప్పదనాన్ని మరోసారి చాటి చెప్పింది. ఎంతో గొప్పచరిత్ర ఉన్న ఈ నేలపై జన్మించడం ప్రతీ తెలుగువాడు గర్వించదగ్గ విషయం. ఆద్యంతం ఆసక్తికరంగా సాగిన కథనాన్ని చదివి పులకించిపోయాం.

**- సత్యనారాయణ,** ఈమెయిల్

### ◆ అసలైన హీరో !

'ప్రకృతి వ్యవసాయం' అనే మంత్రంతో 50 లక్షల మంది రైతులకు మార్గదర్శకంగా మారిన వ్యవసాయ శాస్త్రవేత్త సుభాష్ పాలేకర్ చెప్పిన విషయాలు, విశేషాలు స్ఫూర్తిదాయకంగా తోచాయి. 'జీరోబడ్జెట్ వ్యవసాయం' సూత్రాన్ని పక్కాగా అమలు చేయగలిగితే రైతు రాజుగా మారతాడనడంలో అతిశయోక్తి లేదు.

**- స్వామిదాస్,** హైదరాబాద్

### ◆ కాన్సెప్ట్ నచ్చింది !

వస్తువుకు ఉండే డిమాండ్‌ను బట్టి ధర నిర్ణయించబడుతుంది'నేది మార్కెటింగ్ సూత్రం. కాని ఆచరణలో మాత్రం ఇది పరిమితమై ఉంటుంది. అయితే ఆ రోజు వంటకానికి ఉన్న డిమాండ్‌ను బట్టి, దాని ధరను నిర్ణయించే హోటల్, అదీ హైదరాబాద్‌లో ఉందని తెలిసి ఆశ్చర్యపోయాం. 'కాన్సెప్ట్ రుచులు!' భలే నచ్చేశాయి.

**- కరుణాకర్,** హైదరాబాద్

### ◆ అది పోయి - ఇది వచ్చే !

కొన్ని నెలలుగా వారం వారం వచ్చే 'బేతాళ ప్రశ్న'లకు అలవాటు పడిపోయాం. బుర్రకు పదును పెట్టడమే కాకుండా పని ఒత్తిడిని కాస్త తగ్గించేవి బేతాళుడి ప్రశ్నలు. ఆ శీర్షికను నిలిపివేస్తున్నారన్న ప్రకటన చూసి ఆశ్చర్యపోయాం. అయితే స్పోర్ట్స్ క్విజ్‌తో మళ్లీ కొత్త ఉత్సాహాన్ని తెచ్చారు. వెరైటీ ముల్లంగి రుచులు నోరూరించాయి.

**- విజయ్‌కుమార్,** అదిలాబాద్

# కిర్రాకు పుట్టిస్తున్నారు...
# క్రికెట్ కుర్రాళ్లు!

టెస్టులూ... వన్డేలూ... పొట్టి క్రికెట్ - కాలంతో పాటు ఆట మారుతోంది. ఆటతో పాటు ఆటగాళ్లూ అప్‌డేట్ అవుతున్నారు. ఆ మార్పు మైదానంలోనే కాదు, ఆహార్యంలోనూ కనిపిస్తోంది. మోడళ్లకు సవాలు విసురుతున్నట్టు, కొత్తకొత్త హెయిర్ స్టైల్స్‌తో ఫ్యాషన్ ఐకాన్స్‌లా కనిపిస్తున్నారు క్రికెటర్లు. ఒక్కొక్కరిది ఒక్కో స్టైల్...

## 'స్టైలిష్' యువీ

మొన్నటి వరకూ సొగసైన ఆటతో అభిమానుల మనసు దోచుకున్న యువరాజ్‌సింగ్, ఇప్పుడు కొత్త కేశాలంకరణతో కేక పుట్టిస్తున్నాడు. రింగుల జుట్టును సాఫ్ట్‌గా చేసుకుని, చిన్న చిన్న ముడులు వేసుకుని... మహా స్టైలిష్‌గా కనిపిస్తున్నాడు.

## 'సిక్స్‌ప్యాక్' రాహుల్

ఆరుపలకల దేహంతో, సీజన్‌కో స్టైల్‌తో అభిమానులతో ఫ్యాషన్ మ్యాస్ట్రో అనిపించుకుంటున్నాడు కె.ఎల్. రాహుల్. గాయం కారణంగా ఐపీఎల్‌లో ఆడకపోయినా సామాజిక మాధ్యమాల్లో ఫాలోయింగ్ ఏమాత్రం తగ్గలేదు.

## 'కూల్' రహానే

ఆస్ట్రేలియాతో టెస్టు మ్యాచులు జరిగినప్పుడు... బాగా పెరిగిన మీసం, గడ్డాలతో రఫ్‌గా కనిపించిన రహానే, ఐపీఎల్‌కు వచ్చేసరికి క్లీన్ షేవ్ చేసి, చుబుకం దగ్గర చిన్నపాటి గడ్డంతో కూల్‌కూల్‌గా కనిపించాడు.

## 'బాల్ఫో' హార్దిక్

మైదానంలో పాదరసంలా కదిలే హార్దిక్ పాండ్యా అమ్మాయిల మనసుల్లోకీ అంతే మెత్తగా ప్రవేశిస్తున్నాడు. భుజానికి పెద్ద టాటూతో.... ఇన్నాళ్లూ అలరించిన ఈ గుజరాతీ చిన్నోడు, ఇప్పుడు 'బాల్ఫో' స్టైల్ ఇమిటేట్ చేస్తూ అభిమానులను వెర్రెత్తిస్తున్నాడు.

## 'ట్రిమ్' జడేజా

మూడు ఫార్మాట్లలోనూ ఆధారపడతగ్గ ఆటగాడిగా జడేజాకు బోల్డంత క్రేజ్ ఉంది. జడేజా ఏం చేసినా అదో స్టైల్! తాజాగా జుట్టును వెనక్కి దువ్వాడు. గడ్డం బాగా ట్రిమ్ చేసి... చెంపల వరకూ విస్తరించాడు. దానికితోడు చురకత్తి మీసకట్టు! ఆ స్టైల్‌కి జనం ఫిదా అయిపోయారు.

## 'స్పైక్' సునీల్

వెస్టిండీస్ క్రికెటర్ సునీల్ నరైన్ ఈ ఐపీఎల్‌లో ఓపెనర్‌గా సృష్టించిన విధ్వంసం అంతా ఇంతా కాదు. అయితే దానికన్నా ముందు, తన హెయిర్‌స్టైల్‌తోనే ఎక్కువమందిని తనవైపు తిప్పుకున్నాడు. నడినెత్తిన స్పైక్స్‌తో కనిపించే సునీల్ స్పైక్ హెయిర్ స్టైల్‌కి పేటెంట్ తీసుకున్నాడేమో అనిపిస్తుంది.

## 'పోనీటెయిల్' ఉన్ముక్త్

అండర్ -19 ప్రపంచకప్‌లో మెరుపులు మెరిపించిన భారత్ కెప్టెన్ ఉన్ముక్త్‌చంద్ ఈ ఐపీఎల్‌లో ముంబై ఇండియన్స్ తరపున ఆడాడు. క్రికెట్ తెలియని వాళ్లు అతడ్ని చూస్తే ప్రొఫెషనల్ మోడలేమో అనుకుంటారు. అంత స్టైలిష్‌గా ఉంటాడు. ట్రెండీ హెయిర్‌స్టైల్‌తో, కూల్ టాటూస్‌తో గార్జియస్‌గా కనిపిస్తాడు.

## 'ఇన్‌స్టా' రాణా

ఈ ఐపీఎల్‌లో ముంబై ఇండియన్స్ తరపున మెరుపులు మెరిపించిన నితీష్ రాణా డేరింగ్ బ్యాట్స్‌మెన్ మాత్రమే కాదు... డ్యాషింగ్ స్టైల్ ఐకాన్ కూడా! అందుకే ఇన్‌స్టాగ్రామ్‌లో ఇతడిని ఎనభైరెండు వేల మంది ఫాలో అవుతున్నారు.

# పుణ్యరాశి పెరగంగ!

దైవమ్

**దైవస్వరూపం గంగానది. ఆ నదీమతల్లి ... వైకుంఠంలో అరవై లక్షల యోజనాల విస్తీర్ణంలో, బ్రహ్మలోకంలో ముప్పై లక్షల యోజనాల విస్తీర్ణంలో, శివలోకంలో ముప్పై లక్షల యోజనాల విస్తీర్ణంలో పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తూ ఉంటుందని పురాణాలు చెబుతున్నాయి. అదే తీరులో ధ్రువ, చంద్ర, సూర్య, తపో, జన, మహర్లోక, ఇంద్రలోక, పాతాళలోకాల్లోనూ పరుగులు పెడుతూ ఉంటుందంటారు.**

గంగను ఇంద్రలోకంలో మందాకిని అనీ, పాతాళలోకంలో భోగవతి అనీ, భూలోకంలో అలకనంద అనీ అంటారు. కృత యుగంలో పాల నురుగులా, త్రేతా యుగంలో వెన్నెలలా, ద్వాపర యుగంలో మంచి గంధంలా, కలి యుగంలో నీళ్లలాగా ఉంటుందట గంగ. స్వర్గలోకంలో మాత్రం అన్ని యుగాల్లోనూ పాలలా ప్రవహిస్తూ ఉంటుందని చెబుతారు.

**గంగావతరణం**

దేవనది గంగ భూలోకానికి రావడం వెనుక ఓ గొప్ప కథ ఉంది. ఆ కథలో గంగమ్మ పవిత్ర శక్తి ఉంది. భారతీయ సంస్కృతీ సంప్రదాయాలున్నాయి. నిస్వార్థ పితృభక్తి ఉంది. పూర్వం సగరుడు అనే మహారాజు ఉండేవాడు. ఆయనకు వైదర్భి, శైబ్య అనే భార్యలు. శైబ్య తనకు కుమారుడు జన్మిస్తే చాలని కోరుకుంది. వైదర్భి మాత్రం అరవైవేల మంది బిడ్డలు కలగాలని శివుడిని ఆరాధించింది. శైబ్యకు ఆమె కోరిక ప్రకారం, అసమంజుడు అనే కుమారుడు జన్మించాడు. కొద్దికాలం తర్వాత వైదర్భికి ఒక పెద్ద సొరకాయ లాంటి పిండం కలిగింది. అప్పుడామె మళ్లీ పరమేశ్వరుడిని ఆరాధించడంతో... ఆ కాయ లోపల గింజలలా ఉన్న అరవై వేల మంది పుత్రులు ఉద్భవించారు. వారంతా బలపరాక్రమవంతులుగా ఎదిగారు. అయితే, పెద్దల మీద గౌరవం, క్రమశిక్షణ లాంటివి ఉండేవి కావు.

ఒకసారి సగరుడు అశ్వమేధయాగం చేస్తుండగా యాగాశ్వం కనిపించకుండా పోయింది. అరవై వేల మంది సగర కుమారులు అన్నిచోట్లా వెతుకుతూ పాతాళంలో కపిల మహర్షి ఆశ్రమం దగ్గర యాగాశ్వాన్ని చూశారు. కపిలుడే ఆ గుర్రాన్ని దొంగిలించాడనుకొని ధ్యానంలో ఉన్న ఆ మహర్షిని ఇబ్బంది పెట్టారు. దాంతో ఆయన కోపాగ్నికి మాడి మసైపోయారు. ఈ విషయం సగరుడికి తెలిసింది. దుఃఖంతో రాజ్యాన్ని వదిలి అరణ్యాలకు వెళ్లిపోయాడు. అసమంజుడు మాత్రం సోదరప్రేమతో వారిని బతికించాలని అనుకొన్నాడు. స్వర్గంలో ఉన్న గంగానది ఆ బూడిదరాశుల మీదుగా ప్రవహిస్తే వారంతా బతుకుతారని తెలిసి, గంగాదేవి కోసం చాలాకాలం పాటు తపస్సు చేసి కన్నుమూశాడు.

అసమంజుడి కొడుకు అంశుమంతుడు అదే తపస్సును కొనసాగించాడు. కానీ ఆయన వల్ల కూడా కాలేదు. ఆ తర్వాత అతని కుమారుడు భగీరథుడు గోలోక శ్రీకృష్ణుడి గురించి తపస్సు చేసి, పరమాత్మ అనుగ్రహంతో గంగమ్మను భూలోకానికి తెచ్చేందుకు వరం పొందాడు. అయితే గంగాదేవి, భూలోకంలో పాపాత్ములు ఎక్కువగా ఉంటారనీ వారంతా వచ్చి స్నానం చేస్తే ఆ పాపం తనకు అంటుకుంటుందనీ ... మనసులోని సందేహాన్ని కృష్ణుడికి చెప్పింది. అప్పుడాయన, ఎంతమంది పాపాత్ముల పాపం అంటుకున్నా... ఒక్క భక్తుడు, మంత్ర ఉపాసకుడు, యోగసాధకుడు గంగలో స్నానం చేస్తే చాలు, ఆ పాపాలన్నీ పోతాయని అన్నాడు. అలాగే, పండగ పబ్బాల్లో గంగలో స్నానం చేసిన వారికి అత్యధిక పుణ్యఫలాలు దక్కుతాయని మాటిచ్చాడు. ఆ తర్వాత తనే స్వయంగా గంగను పూజించాడు.

భగీరథుడు కూడా గంగమ్మను పూజించి... భూలోకానికి గంగ దూకేటప్పుడు ఆమెను భరించే బాధ్యతను శివుడికి అప్పగించాడు. భగీరథుడి వెంట భూలోకానికి వచ్చింది కనుక భాగీరథి అయింది గంగ. భగీరథుడి వెంట వెళుతున్నప్పుడు జహ్నుమహర్షి గంగను మింగాడు. మళ్లీ భగీరథుడు ప్రార్థించడంతో ఆయన విడిచిపెట్టాడు. ఆ క్రమంలోనే ఆమెకు జాహ్నవి అనే పేరొచ్చింది.

**రూప సౌందర్యం**

గంగమ్మది దివ్య సౌందర్యం. దేవీభాగవతంలో ఆ రూప వర్ణన కనిపిస్తుంది. గంగాదేవి గోలోక శ్రీకృష్ణుడి నుంచి ఆవిర్భవించింది. అప్పుడామె తెల్ల కలువలాగా మెరిసిపోతూ అగ్నిజ్వాలల లాంటి మేలిముసుగుతో, రత్నాభరణాలతో కాంతులీనుతూ ఉంటుంది. నూరు శరత్ పూర్ణిమల దివ్యకాంతితో చిరునవ్వులు చిందిస్తూ ఉంటుంది. నిత్య యవ్వనంతో శాంతస్వరూపిణిగా సౌభాగ్య వంతురాలుగా, మాలతీ పుష్పమాలికలను ధరించి చెక్కిళ్లమీద సిందూర చందన కస్తూరి బిందువులతో కళకళలాడుతూ ఉంటుంది. దొండపండ్ల లాంటి ఎర్రటి పెదవులు, ముత్యాల కోవలలాంటి పలువరుస, అందమైన కళ్లు, క్రీగంటి వాలుచూపులతో మనోహరంగా ఉంటుంది.

**రాధాకృష్ణులే గంగాదేవి**

గంగాదేవి సాక్షాత్తూ దైవస్వరూపమే అని చెప్పేందుకు ఓ ఐతిహ్యం ఉంది. ఓసారి గోలోకంలో రాధాకృష్ణులు కొలువుదీరి ఉన్నారు. సకల దేవతలు, రుషి, మునిగణాలు ఆ కొలువులో ఉన్నారు. అప్పుడు సరస్వతీదేవి చక్కటి పాట పాడింది. ఆ పాటకు అందరూ పరవశించిపోయారు. బ్రహ్మదేవుడు శివుడి దగ్గరకొచ్చి ఆయనను కూడా ఒక పాటపాడమని కోరాడు. శివుడు పాడిన పాటకు అంతా మైమరచిపోయారు. పాట పూర్తికాగానే అందరూ తేరుకుని చూసేసరికి రాధాకృష్ణులు కనిపించలేదు. దేవతలంతా కంగారుపడ్డారు. బ్రహ్మ కృష్ణుడిని ప్రార్థించాడు. అప్పుడు అశరీరవాణిలా కృష్ణుడి గొంతు వినిపించింది. శివుడి పాటకు తామిద్దరం కరిగిపోయినట్లు, మళ్లీ శివుడు వేదాలలోని అపూర్వ మంత్రాలను తమ కోసం రచిస్తే... అప్పుడు అసలు రూపంలోకి వస్తామని చెప్పాడు. వెంటనే శివుడు అక్కడ జలరూపంలో ప్రవహిస్తున్న నీటిని దోసిటలోకి తీసుకొని స్తోత్రాలను చదివి పూజ చేశాడు. రాధాకృష్ణులు ప్రత్యక్షమయ్యారు. అప్పుడక్కడ ఉన్న జలమే గంగానది అయింది.

రామాయణ, మహాభారతాలలో గంగ ప్రస్తావన ఉంది. గంగకు, శంతనుడికి జన్మించిన దేవవ్రతుడే కురువృద్ధుడైన భీష్మాచార్యుడు. కాశీ లాంటి క్షేత్రాలలో గంగకు నిత్యపూజలూ, హారతులూ అర్పిస్తున్నారు. ఆ అవకాశం లేనివారు గంగను ధ్యానించి ఏ నీటిని నెత్తిన పోసుకున్నా గంగా స్నాన ఫలమే దక్కుతుంది.

- శ్రీమల్లి,
98485 43520





# తోబుట్టువుల తగువు తీర్చేదెలా?

**ప్రశ్న: మేడమ్... నాకు ఇద్దరు పిల్లలున్నారు. ఎప్పుడు చూసినా గొడవ పడుతూనే ఉంటారు. ఒకరంటే మరొకరికి అస్సలు పడదు. ఇంట్లో మనశ్శాంతి లేకుండా పోతోంది. అప్పుడప్పుడూ సహనం కోల్పోయి ఇద్దర్నీ చెరో దెబ్బ వేస్తుంటాను. ఈ తోబుట్టువుల తగువు తీరేదెలా?**

**- జ్యోతి, హైదరాబాద్**

**జ :** ఈ సమస్య చాలా ఇళ్లల్లో ఉండేదే. రెండో బిడ్డను కంటున్నప్పుడే తల్లిదండ్రులు మొదటి బిడ్డను అందుకు తగ్గట్టుగా ప్రిపేర్ చేయాలి. సాధారణంగా ఇంట్లోకి రెండో బిడ్డ రాగానే మొదటి బిడ్డ అప్పటిదాకా నిరాటంకంగా కొనసాగిన తన ఆధిపత్యాన్ని ఎవరో లాక్కున్నట్టుగా ఫీలవుతుంది. వాళ్లిద్దరూ ఎదుగుతున్న కొద్దీ ఏమవుతుందంటే... పెద్ద పాప కానీ, బాబు కానీ అప్పటిదాకా తనకు సంబంధించినవాటినీ, తనవీ అని అనుకున్నవాటినీ (బొమ్మలు, దుస్తులు, పుస్తకాల వంటివి) చెల్లెలికి లేదా తమ్ముడికి ఇవ్వాలనే ఒత్తిడి పేరెంట్స్ నుంచీ, ఇతరుల నుంచీ వస్తుంటుంది. ఈ ఒత్తిడి వల్ల తన తర్వాత పుట్టిన చెల్లెలు, లేదా తమ్ముడి పట్ల కోపాన్ని పెంచుకుంటారు. ఉదాహరణకు, ఏదైనా కారణంతో పెద్దమ్మాయి తనకన్న చిన్నవాళ్లయిన తమ్ముడినో, చెల్లెల్నో కొడితే, వెంటనే పెద్దవాళ్లు ఆమెనే కొడతారు. అలా కొట్టడం తప్పనే విషయం ఆ వయసులో పెద్దమ్మాయికి తెలియదు. పేరెంట్స్ తనను కొట్టడానికి కారణం తమ్ముడు, చెల్లేనని అనుకుని వారిపై అకారణంగా ద్వేషం పెంచుకోవడం మొదలెడుతుంది.

తల్లిదండ్రులు కూడా చాలాసార్లు పిల్లల మధ్య అనవసరపు పోలిక తెస్తుంటారు. ఉదాహరణకు ఎవరు బాగా చదువుతున్నారో, ఎవరు బాగా చదవడం లేదో... ఇలా పోలుస్తూ ఉంటే బలహీనంగా ఉన్నవాళ్లు సహజంగానే ఒత్తిడికి లోనవుతారు. అందుకే ఎప్పుడైనా సరే పిల్లలను ఒకరితో పోల్చకూడదు. తోబుట్టువుల తగువు రాకుండా ఉండాలంటే పేరెంట్స్ పాత్రే ఎక్కువగా ఉంటుంది. ఎప్పుడూ ఒకరినే సమర్థించకుండా, పిల్లలు ఎప్పుడైనా కలబడితే పేరెంట్స్ ఓపిగ్గా వారి మాటలనూ, సమస్యనూ వినాలి. వారికి నచ్చచెప్పే ప్రయత్నం చేయాలి.




**ప్రశ్న: మేడమ్ నమస్తే... మా అబ్బాయి వయసు 20 సంవత్సరాలు. ప్రస్తుతం హైదరాబాద్‌లోని ఒక ఇంజనీరింగ్ కాలేజీలో చదువుతున్నాడు. ఈ మధ్య కాలేజీల్లో డ్రగ్స్ దొరికాయనీ, విద్యార్థులు సిగరెట్లు తాగుతున్నారనీ, మద్యం సేవిస్తున్నారనీ వార్తల్లో చదివినప్పుడూ, విన్నప్పుడూ నాకు భయం కలుగుతోంది. మా అబ్బాయిని వీటన్నింటికి దూరంగా ఉంచాలంటే ఏంచేయాలి?**

**- మహాలక్ష్మి, తెనాలి**

**జ :** నిజం చెప్పాలంటే, పిల్లలకు సంబంధించి తల్లిదండ్రులకు ఇది ఛాలెంజింగ్ ఏజ్. ఆ వయసులో ఎవరైనా పాజిటివ్ కన్నా, నెగిటివ్ వైపు ఎక్కువగా ఆకర్షితులవుతారు. అందుకే చిన్నప్పటి నుంచే ఇంట్లో మంచి వాతావరణం అలవాటు చేయాలి. పిల్లలకు వారి తల్లిదండ్రులే రోల్‌మోడల్‌గా కనిపించాలి. అలాంటి చెడు అలవాట్లు మనకున్నాయా? అలాంటి చోట్లకు పిల్లల్ని కూడా తీసుకెళ్తున్నామా? అనేది ఒకసారి ఆలోచించుకోవాలి. ముఖ్యంగా కాలేజీలో అతడికి ఎలాంటి స్నేహితులున్నారో చూడాలి. ఫ్రెండ్స్‌ను అప్పుడప్పుడూ ఇంటికి కూడా తీసుకొచ్చేలా మన పిల్లల్ని ఎంకరేజ్ చేయాలి. దానివల్ల మీ అబ్బాయితో పాటు అతడి స్నేహితుల ఆలోచనా విధానం ఎలా ఉందో కూడా తెలుస్తుంది. ఎదుగుతున్న పిల్లలతో తల్లిదండ్రులు స్నేహితుల్లా మెలగాలి. సమయం కేటాయించి మరీ, అన్ని విషయాల్లో వారిని ఎడ్యుకేట్ చేయాలి. వారితో తరచూ మాట్లాడుతుండాలి. సిగరెట్, మద్యం, డ్రగ్స్ వల్ల ఎలాంటి దుష్ఫలితాలుంటాయో అర్థమయ్యేలా వివరించాలి. పిల్లలు పేరెంట్స్‌ను ఫ్రెండ్స్‌లాగా భావించినప్పుడే, ప్రతీ విషయాన్ని వారితో షేర్ చేసుకుంటారనే విషయాన్ని మర్చిపోకూడదు.



**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్,
కిమ్స్ హాస్పిటల్

**మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.**
**అడ్రస్ : ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, మెయిల్ ఐడి : sunday.aj@gmail.com**

# మాయాలేదు... మంత్రంలేదు... వర్చువల్ రియాలిటీ!

**కవర్ స్టోరీ**

**ఇప్పటికిప్పుడు... కాలక్షేప సాధనంలా అనిపించవచ్చు కానీ, భవిష్యత్తు అంతా వర్చువల్ రియాలిటీదే! సకల సాంకేతిక పరిజ్ఞానాలూ వీఆర్ చుట్టే తిరగబోతున్నాయి. రైట్ సోదరుల విమానం తర్వాత, అంతటి మలుపు తిప్పే ఆవిష్కరణగానూ చెబుతున్నారు.**

క్రికెట్ అంటే మీకు ప్రాణం. అభిమాన ఆటగాడు పరుగుల తుపాను సృష్టిస్తుంటే కళ్లింతలు చేసుకుని చూడాలని మీ ఆశ. కానీ... స్టేడియం దాకా వెళ్లడానికి బద్ధకం. రద్దీ అంటే చచ్చేంత అయిష్టం. గడప దాటకుండానే స్టేడియంలో అడుగుపెట్టే ఉపాయం ఏదైనా ఉంటే మీక్కావాలి.

అంతేగా! సిద్ధంగా ఉండండి.

• • •

తెరమీద హీరో.... కత్తి యుద్ధం చేస్తాడు. గుర్రపుస్వారీ చేస్తాడు. మృగరాజుతో తలపడతాడు. గజరాజునే కూలగొడతాడు. అరడజనుమంది హీరోయిన్లతో డ్యూయెట్లు ఆడేస్తాడు. అయినా, ఆ చెత్తంతా చూడ్డానికా వందో రెండొందలో పెట్టి టికెట్టు కొనేది. ఇంకో ఐదొందలు పోయినా పర్వాలేదు. ఆ సినిమాలో నేనే హీరో కావాలి. నా విన్యాసాల్ని నేనే తెర మీద చూసుకోవాలి - ఇదేగా మీ కోరిక.

తథాస్తు. తథాస్తు. తథాస్తు.

• • •

పెద్దగా కష్టపడాల్సిందేం లేదు. మరీ ఖరీదైన వ్యవహారమూ కాదు. ఏ అమెజాన్‌లోనో ఆర్డరిచ్చి వర్చువల్ రియాలిటీ హెడ్‌సెట్స్ తెప్పించుకుంటే సరిపోతుంది. ఆ డబ్బా... వాస్తవాలకూ ఊహలకూ మధ్య సన్నని విభజన రేఖను చెరిపేస్తుంది. కోరుకున్న ప్రపంచాన్ని 360 డిగ్రీల్లో చూపెడుతుంది. అయితే, వీఆర్ వీడియోను చూడ్డానికి మన మొబైల్‌లో గైరోస్కోప్ టెక్నాలజీ ఉండాలి. ప్రస్తుతానికి వర్చువల్ రియాలిటీ అనుభూతులు ప్రాథమిక దశలోనే ఉన్నాయి. కొద్దిపాటి గేమ్స్‌కో, సినిమా ట్రయిలర్స్‌కో పరిమితం అవుతున్నాయి. అయితేనేం, ఇదంతా ఆరంభమే. ముందుంది.... వర్చువల్ పండగ!

ఇందులో రెండు సాంకేతిక పరిజ్ఞానాలున్నాయి.

ఒకటి... మోషన్ క్యాప్చర్ టెక్నాలజీ.

రెండు... త్రీడీ.

కుర్చీలో కూర్చున్నవాళ్లం కూర్చున్నట్టే ఉంటాం కానీ, వర్చువల్‌గా మనం కోరుకున్న చోటుకు వెళ్లిపోతాం. క్రీడాభిమాని అయితే ఆట మైదానానికి, ఉద్యోగి అయితే కార్పొరేట్ కార్యాలయానికి. ఇదంతా మోషన్ టెక్నాలజీతో వీలవుతుంది. రెండోది త్రీడీ. దీనివల్ల దృశ్యాలన్నీ త్రీ డైమన్షన్‌లో దర్శనమిస్తాయి. దీంతో, కళ్లముందు కనిపించేదంతా వాస్తవమే అన్న భ్రమలో ఉండిపోతాం. అంతే. అంతకు మించి మాయా లేదూ మంత్రం లేదూ!

బడి నుంచి ఆపరేషన్ థియేటర్ వరకూ... ఆ సాంకేతిక చమత్కారాన్ని ఎక్కడైనా ఉపయోగించుకోవచ్చు. పర్యాటకం, చరిత్ర, విద్య - ఎందుకైనా అన్వయించుకోవచ్చు. ఆ ప్రయత్నం మొదలైంది కూడా.

వర్చువల్... భావనాత్మకం!

రియాలిటీ... వాస్తవం! అంటే - భావనాత్మక వాస్తవం!





ఇక్కడ, ఆట చూడటం వాస్తవం. స్టేడియం దాకా వెళ్లడం మాత్రం భావనాత్మకం.

ఫేస్‌బుక్ వ్యవస్థాపకుడు జుకెర్‌బర్గ్ దీన్ని... 'సరికొత్త కమ్యూనికేషన్ ప్లాట్‌ఫామ్' అంటాడు. గూగుల్, ఆపిల్, మైక్రోసాఫ్ట్, సామ్‌సంగ్, హెచ్‌టీసీ తదితర టెక్ దిగ్గజాలు ఇప్పటికే వీఆర్ మీద దృష్టిపెట్టాయి. ప్రత్యేక పరిశోధన విభాగాల్ని ఏర్పాటు చేశాయి, లేదంటే, వీఆర్ స్టార్టప్స్‌లో పెట్టుబడులు పెట్టి... తామూ పోటీలో ఉన్నామంటూ ప్రపంచానికి చాటాయి. 2014లో ఫేస్‌బుక్ ఓకులస్ వీఆర్ అనే ఓ మామూలు కంపెనీని కోరికోరి సొంతం చేసుకోవడంతో ... ప్రపంచమంతా వర్చువల్ రియాలిటీ వైపు ఆశ్చర్యంగా చూసింది. అప్పటి నుంచి చూస్తూనే ఉంది. రానున్న రెండుమూడేళ్లలో వీఆర్ అనేది అక్షరాలా లక్ష కోట్ల రూపాయల వ్యాపారం. ఇప్పటికే వందకుపైగా కంపెనీలు పుట్టుకొచ్చాయి. హైదరాబాద్‌లోనే పాతిక ముప్పై స్టార్టప్స్ కనబడతాయి.

**'వీఆర్' యాత్రా స్పెషల్**

ప్రపంచాన్ని చుట్టేయాలనుకుంటే వీసాతో పన్లేదు. పాస్‌పోర్టుతో ఇబ్బంది లేదు. భాష రాకపోయినా ప్రమాదమేం లేదు. బ్యాంకు బ్యాలెన్సు లేకపోయినా కోరికను చంపుకోవాల్సిన అగత్యమూ లేదు. 'వర్చువల్ రియాలిటీ టూర్స్'తో... థియేటర్ లాంటి ఓ గదిలో కూర్చుని ప్రపంచాన్ని చుట్టుకుని రావచ్చు. 'టోటల్‌యోగా' అనే సంస్థ తన కస్టమర్లకు... ఇరుకిరుకు అపార్ట్‌మెంట్ గదిలోని ఓ చాపమీద ఆసనాలు వేస్తున్నా... ఏ కన్యాకుమారిలోనో సముద్రం ఒడ్డున యోగాచేస్తున్న భావనను కలిగిస్తోంది. ఇలాంటి అనుభూతుల్ని ఆస్వాదించాక సాధారణంగా ఎవరైనా, 'హమ్మయ్య! వర్చువల్‌గా అయితేనేం, ప్రపంచమంతా తిరిగొచ్చాం. ఇక, గడప దాటక పోయినా ఫర్వాలేదు' అని సంతృప్తి పడిపోతారని అనుకుంటాం. కానే కాదు. నిన్న మొన్నటి దాకా ఆర్థిక కారణాలతోనో, ఇంకేవో ఇబ్బందులతోనో వెనకడుగు వేసినవాళ్లంతా 'వర్చువల్ రియాలిటీ' టూర్ తర్వాత... ప్రపంచ యాత్రల విషయంలో మరింత పట్టుదలతో ఉంటున్నారు. ఇదంతా... ఏ పుల్లారెడ్డి కొట్టుకో వెళ్లినప్పుడు సేల్స్‌మాన్ ఇచ్చే మిఠాయి ముక్కలాంటి వ్యవహారం. 'ఇంకాస్త కావాలన్న ఆసక్తిని పెంచుతుందే కానీ తుంచదు' అంటారు నిర్వాహకులు. అందుకే ట్రావెల్ ఏజెంట్లు... మునుపట్లా కరపత్రాలూ గట్రా ఇవ్వడం లేదు. ఆ వీఆర్ హెడ్‌సెట్లు చేతిలో పెడుతున్నారు. ఇంకేముంది, ఓ పది నిమిషాల తర్వాత, టికెట్లు ఖరారు చేసుకోవాల్సిందే.

ఆమధ్య, ఓ వయోధికుడు వర్చువల్ టూర్‌కు బయల్దేరాడు. వెళ్లింది ఏ కాశీకో రామేశ్వరానికో కాదు... హిమాలయాలకు! కుర్రాడిగా ఉన్నప్పుడు మంచుకొండల్ని అధిరోహించాలని ఉబలాటపడ్డాడట. అమ్మానాన్నలు వద్దన్నారు. పెళ్లయ్యాక ప్రయాణమైతే, భార్య అడ్డు చెప్పింది. ఉద్యోగంలో చేరాక సెలవు దొరకలేదట. రిటైర్మెంటు తర్వాత బోలెడంత తీరిక ఉంది కానీ, ఓపిక లేదు. ఆరోగ్యమూ అంతగా సహకరించడం లేదు. ఎవరో సలహా ఇస్తే 'భావనాత్మక ప్రపంచంలో' పర్వతారోహకుడి అవతారం ఎత్తాడు. హెడ్‌సెట్స్ తీస్తున్న సమయానికి అతడి మోహంలో ఎవరెస్టు మీద జెండా ఎగరేసివచ్చినంత సంతృప్తి.

బాలీవుడ్ బ్లాక్‌బస్టర్ 'షోలే' చిత్రంలో చాలాభాగాన్ని కర్ణాటకలోని రామదేవరబెట్ట పరిసరాల్లో చిత్రీకరించారు. వర్చువల్ టెక్నాలజీతో ఆ ప్రాంతాన్ని టూరిజం కేంద్రంగా మలచబోతున్నారు. అక్కడికెళ్లగానే, 'కిత్‌నే ఆద్మీ థే...' అంటూ గబ్బర్‌సింగ్ నేరుగా మనల్నే ప్రశ్నిస్తాడు. ఇదే టెక్నాలజీని యథాతథంగా గోల్కొండ కోటకూ అన్వయించుకోవచ్చు. మనం వెళ్తూ ఉంటే... అక్కన్న మాదన్నలు ఎదురొస్తారు, భాగమతి పల్లకీ ఎక్కి వనవిహారానికి వెళ్తూ ఉంటుంది. వీధుల్లో ముత్యాలు రాశులుగా పోసి విక్రయిస్తుంటారు. మల్కిభరాముడు మహా తన్మయంగా తెలుగు కవిత్వాన్ని ఆస్వాదిస్తుంటాడు. ఎంత అద్భుత దృశ్యం.

## ఏఆర్ వర్సెస్ వీఆర్

**అగుమెంటెడ్ రియాలిటీ అయినా వర్చువల్ రియాలిటీ అయినా.... హెడ్‌సెట్స్ ధరించినవాళ్లను భావనాత్మక ప్రపంచంలోకి తీసుకెళ్తాయి. వర్చువల్ రియాలిటీ, వాస్తవ జీవితం ఈ రెండూ జతకూడితే అది అగుమెంటెడ్ రియాలిటీ. ఏఆర్‌లో... తన చుట్టూ ఉన్న వర్చువల్ ఆబ్జెక్ట్స్‌తో పనిచేస్తూనే వాస్తవంలోనూ ఉండగలుగుతారు. ఏది నిజమే, ఏది భావనో తెలుస్తూనే ఉంటుంది. కానీ, వర్చువల్ రియాలిటీలో మాత్రం పూర్తిగా ఓ కొత్త ప్రపంచంలోకి వెళ్లిపోతారు. ఏది వాస్తవమో, ఏది కాదో చెప్పడం కష్టమే. మిక్స్‌డ్ రియాలిటీ అన్న మాటా ఇప్పుడిప్పుడే వినిపిస్తోంది. మొదటి రెండూ కలిస్తే మూడోది పుట్టుకొచ్చింది.**

## బేస్‌బాల్ చూద్దాం...

**కంప్యూటర్ దిగ్గజం ఇంటెల్, బేస్‌బాల్ లీగ్ చేతులు కలిపి వర్చువల్ రియాలిటీలో ఆట చూసే అద్భుత అవకాశాన్ని కల్పిస్తున్నాయి. అయితే, అందుకు ఇంటెల్ ట్రూవీఆర్ ఆప్‌ను డౌన్‌లోడ్ చేసుకోవాల్సి ఉంటుంది. ఆటకు సంబంధించిన గణాంకాల్ని కూడా ఎప్పుడు కావాలంటే అప్పుడు చూసుకోవచ్చు.**




## పెళ్లి వీడియోలూ...

**ఒకప్పుడు పెళ్లికి ఫొటోలు తీయించడమంటేనే గొప్ప. ఆతర్వాత వీడియోలొచ్చాయి. ఇప్పుడు, ఇంకాస్త ముందుకెళ్లి పెళ్లికిముందూ, పెళ్లి తర్వాతా... రకరకాల లొకేషన్స్‌లో ప్రీ-పోస్ట్ వెడ్డింగ్ షూట్స్ ఏర్పాటు చేస్తున్నారు. ఆ హంగామా అంతా... వర్చువల్ రియాలిటీలో ఉంటే - అదిరిపోదూ! ఆ ప్రయత్నమే జరుగుతోందిప్పుడు. 'మెరాకీ' అనే స్టార్టప్ ఈ తరహా సేవల్ని కూడా అందిస్తోంది.**

## తెలుగు సత్తా...

**వీఆర్ స్టార్టప్స్‌లో తెలుగు యువకులు సత్తా చాటుతున్నారు. హేమంత్ సత్యనారాయణ ప్రారంభించిన 'న్యూస్పేస్'కు నాస్కామ్ సంస్థ 'మోస్ట్ ఇన్నొవేటివ్ అండ్ హై పొటెన్షియల్ ప్రొడక్ట్'గా కితాబు ఇచ్చింది. కేవలం రెండు ఎంబీపీఎస్ కనెక్షన్‌తో ప్రపంచంలో ఏ మూల నుంచి ఏ మూలకైనా వర్చువల్ అవతార్‌లో సంభాషించే అవకాశం కల్పిస్తుంది సంస్థ. మెరాకీ వ్యవస్థాపక బృందంలో సాయిరాం సాగిరాజు అనే తెలుగు వ్యక్తీ ఉన్నాడు.**

## త్రీడీ ప్లస్

**వర్చువల్ రియాలిటీని త్రీడీ ప్రింటింగ్‌తో జోడిస్తే... మరిన్ని అద్భుతాలే. త్వరలోనే ఆ ముచ్చటా తీరనుంది. భావనాత్మక ప్రపంచంలో స్పర్శానుభూతినీ పొంద వచ్చు. అంటే, తాజ్‌మహల్‌ను కళ్లారా చూడ్డమే కాదు, ఆ పాలరాతి నిర్మాణాన్ని సుతారంగా తడమవచ్చు కూడా.**

## అప్పుడే...

**ఇప్పటి మాట కాదు. 1968లోనే ఇవాన్ సదర్లాండ్, బాబ్ స్ప్రౌల్ అనే కంప్యూటర్ శాస్త్రవేత్తలు వర్చువల్ రియాలిటీ హెడ్ సెట్‌ను కనిపెట్టారు. కాకపోతే, అది చాలా బరువుగా ఉండేది. ఓ ఐదు నిమిషాలు పెట్టు కోవడమూ అసాధ్యమయ్యేది. దీంతో, ఎవరూ కొనడానికి ముందుకు రాలేక పోయారు. ఎక్కడెక్కడివారితోనో మాట్లాడ గలిగే 'మాయా దర్పణాలు' తెలుగు కథల్లో, జానపద సినిమాల్లో బోలెడన్ని.**

రియల్ ఎస్టేట్ రంగం కూడా వర్చువల్ రియాలిటీ దారి పట్టింది. ఏడాది తర్వాతో, రెండేళ్ల తర్వాతో మనం నివసించబోయే ఫ్లాట్ ఎలా ఉంటుందో చెప్పడానికి... మునుపట్లా ఊహాచిత్రాల్ని చూపించాల్సిన పన్లేదు. కళ్లకు వీఆర్ సెట్లు తగిలిస్తే సరిపోతుంది. మీరిక.. ఆ డ్రాయింగ్‌రూమ్‌లో పచార్లు చేస్తారు. ఆ బాల్కనీలోంచి ఆకాశంవైపు చూస్తారు. ఇప్పటికే కొన్ని సంస్థలు వీఆర్ సాక్షిగా విక్రయాలు పెంచుకున్నాయి.

### 'వర్చువల్' డాక్టర్

కొన్ని శస్త్రచికిత్సల తర్వాత రోగి తీవ్రమైన నొప్పులకు గురవుతాడు. తట్టుకోలేని ఆ బాధ నుంచి ఉపశమనం ప్రసాదించడానికి వైద్యులు పెయిన్‌కిల్లర్స్‌ను వాడుతుంటారు. అవీ పనిచే యకపోతే, మాదకద్రవ్యాల్నీ తగు మోతాదులో ఇస్తుంటారు. నొప్పి శారీరకమైనదే అయినా, మనసు ప్రభావమూ తక్కువేం కాదు. అనారోగ్యం గురించే ఆలోచిస్తూ కూర్చుంటే, బాధ పదిరెట్లు పెరిగినట్టు అనిపిస్తుంది.

అందుకే, వైద్య పరిశోధకులు వర్చువల్ రియాలిటీని రంగంలో దించారు. వర్చువల్ ప్రపంచంలోని అద్భుతాలవైపు మళ్లించినప్పుడు.... తాత్కాలికంగా మెదడు నొప్పికి సంబంధించిన సంకేతాల్ని చేరవేయడం మరచిపోతుంది. దీంతో రోగి ప్రశాంతంగా ఉండగలుగుతాడు - అన్నది నిపుణుల విశ్లేషణ. ఫోబియాల్ని పోగొట్టడంలోనూ వర్చువల్ రియాలిటీ ఉపయోగపడుతుంది. అది వర్చువల్‌గా కావచ్చు, వాస్తవంగా కావచ్చు... ఒకే పనిని పదేపదే చేయించడం ద్వారా... ఆ పని పట్ల ఉన్న భయాల్ని పోగొట్టడం అసాధ్యమేం కాదు. నీళ్లంటే భయపడేవారిని వీఆర్ ద్వారా సముద్రంలో ఈత కొట్టించవచ్చు. కొండలంటే జడుసుకుని చచ్చేవారిని శిఖరం అంచుల దాకా తీసుకెళ్లవచ్చు. వైద్య ప్రపంచం ఆ వైపుగానే అడుగులు వేస్తోందిప్పుడు. సాలెపురుగుల్ని చూడగానే గుండెల మీద చేతులు వేసుకునే వారి కోసం 'స్పైడర్ వరల్డ్' పేరుతో ఓ వీఆర్ అప్లికేషన్ అందుబాటులోకి వచ్చింది. దురలవాట్లను మాన్పించడానిక్కూడా ఇదే టెక్నాలజీని సంధిస్తున్నారు. ఏ ధూమపానాన్నో తీసుకుంటే... ఆ ప్రభావం ఊపిరితిత్తుల మీద ఎలా ఉంటుందో, ఒక్కో అవయవాన్నీ క్రమక్రమంగా ఎలా దెబ్బతీస్తుందో కళ్లకు కట్టవచ్చు. ఎంత వ్యసనపరుడైనా చచ్చినట్టు ఆ ఊబిలోంచి బయటపడతాడు.

బోధన రంగంలోనూ వీఆర్ ఒక విప్లవమే. గుండె అడ్డుకోత అయినా, మూత్రపిండం నిలువుకోత అయినా... కళ్లకు కట్టినట్టు చూపించవచ్చు. చరిత్ర పాఠమైతే... ఏకంగా విజయనగర సామ్రాజ్యాన్నే కళ్లముందు నిలపవచ్చు. పౌరశాస్త్ర పాఠమైతే... పార్లమెంటు భవనాన్ని వర్చువల్‌గా చూపించవచ్చు. మహాత్ముడి గురించి చెబుతుంటే... కొల్లాయి కట్టిన రూపం కళ్లముందు మెదలాల్సిందే. ఇక వైద్య విద్యార్థులైతే శరీర నిర్మాణాన్ని తెలుసుకోడానికి శవాల కోసం వెదుక్కోనక్కర్లేదు. వర్చువల్ రియాలిటీ ద్వారానే... మనిషిలోని అణువణువునూ చూడగలుగుతారు. ఒకటో తరగతి, రెండో తరగతి పాఠాలు భవిష్యత్తులో మరింత ఆసక్తికరంగా ఉండబోతున్నాయి. ఒకట్రెండు అంతర్జాతీయ పాఠశాలలు వీఆర్ పాఠాలతో ప్రయోగాలు చేస్తున్నాయి కూడా.

### వినోదం 'అన్‌లిమిటెడ్'

మామూలు సినిమా అనుభూతి ఒక చికెన్ ముక్కతో సమానమైతే, వర్చువల్ రియాలిటీ సినిమా మూడొందల అరవై కత్తిలాంటి పీసులతో సమానం. ఎవరో కెమెరామెన్ జూమ్ చేసి తీసిన దృశ్యాన్ని, అబ్బురంగా చూసి మురిసిపోవడం కాదు... ఏ సీన్‌ను జూమ్ చేసి చూడాలన్నదీ మనమే నిర్ణయించుకుంటాం. ఇప్పటికే పీవీఆర్ సినిమాస్ నొయిడాలోని తమ థియేటర్లలో వర్చువల్ రియాలిటీ లాంజ్‌లు ఏర్పాటు చేసింది. సినిమాకు

# 'దేశీ' హెడ్‌సెట్స్

**అంతర్జాతీయ దిగ్గజాలు పది వేల నుంచి పాతికవేల రూపాయల ధరకు వర్చువల్ హెడ్‌సెట్స్‌ను విక్రయిస్తున్న సమయంలో... మన కుర్రాళ్లు మహాచవగ్గా తయారు చేసి దిగ్గజాలకు చెమటలు పట్టించారు. చెన్నై కేంద్రంగా పనిచేస్తున్న జెబ్‌రోనిక్స్ అక్షరాలా పదహారు వందలకు లక్షణమైన హెడ్‌సెట్‌ను అందించింది. అదో సంచలనం. ఆతర్వాతే మిగతావాళ్లూ దారికొచ్చారు.**



ముందో, తర్వాతో కాసేపు ప్రేక్షకులు ఆ వీఆర్ మయాబజార్‌ను సందర్శించవచ్చు. తొలి దశలో ప్రవేశం ఉచితమే అయినా, ఆతర్వాత మాత్రం టికెట్టు కొనుక్కోవాల్సిందే. ఇప్పటిదాకా మన సినిమాలు ప్రీ-రిలీజ్ ప్రచారం కోసమే వర్చువల్ రియాలిటీ మాధ్యమాన్ని వాడుకుంటున్నాయి. పూర్తి వీఆర్ బొమ్మ రావడం కాస్త ఆలస్యమైతే కావచ్చు కానీ, రావడం మాత్రం పక్కా!







బాహుబలి ఆడియో విడుదల కార్యక్రమాన్ని వర్చువల్ రియాలిటీ టెక్నాలజీతో చిత్రీకరించారు రాజమౌళి. 'అసలు వర్చువల్ రియాలిటీ సినిమా తీయడం అనేది ఓ ప్రత్యేకకళ. సాధారణ సినిమా నిర్మాణంతో దాన్ని పోల్చి చూడలేం. రానున్న నాలుగైదేళ్లలో వీఆర్ సినిమా ఊపందుకోబోతోంది' అంటారు జక్కన్న.

**పుస్తకపఠనం...డ్రైవింగ్**

త్వరలోనే, పుస్తక పఠనమూ ఓ కొత్త అనుభూతిగా మారనుంది. వర్చువల్ రియాలిటీ పుస్తకాన్ని చదువుతున్నప్పుడు... కథలోని పాత్రల్ని చూడవచ్చు. కథలోని ప్రాంతాల్ని సందర్శించవచ్చు. కథతో పాటు మనమూ ఆయా కాలాల్లోకి వెళ్లిపోవచ్చు. ఇప్పటికే ఆ ప్రయత్నం మొదలైంది. అమర్‌చిత్రకథ ప్రచురణ కర్తలు ఓ స్టార్టప్‌తో ఒప్పందం కుదుర్చుకున్నారు కూడా. సైనిక శిక్షణలో కూడా వీఆర్ టెక్నాలజీని ఉపయోగించే రోజు ఎంతో దూరం లేదు. యుద్ధాల్లాంటి తీవ్ర సంక్షోభాలు ఎప్పుడో తప్ప రావు. దీంతో చాలామంది సైనికులకు యుద్ధ వాతావరణంలో పనిచేసిన అనుభవం ఉండదు. అనుకోకుండా యుద్ధం వస్తే? పటాలానికి పటాలం నోరెళ్లబెట్టాల్సిందే. ఆ ఇబ్బంది రాకుండా... వర్చువల్ రియాలిటీలో యుద్ధ వాతావరణాన్ని సృష్టించి సైన్యానికి శిక్షణ ఇవ్వబోతున్నారు అధికారులు.

త్వరలోనే కార్ల షోరూములూ 'వీఆర్'ను ఆశ్రయించబోతున్నాయి. కొనే ముందు, కారు చుట్టూ తిరిగి పైపైన చూడ్డం కాదు .. ఆ కార్లో కూర్చున్న అనుభూతినీ, ఆ కారును నడుపుతున్న ఆనందాన్నీ 'వర్చువల్'గా ఎంజాయ్ చేయవచ్చు. టాటా మోటార్స్ ఆ వైపుగా ప్రయత్నాలు ప్రారంభించింది. అంతర్జాతీయ వాహన దిగ్గజం బీఎండబ్ల్యూ కూడా 'వర్చువల్ రియాలిటీ రిటెయిల్ ఎక్స్‌పీరియన్స్'ను అందించడానికి సిద్ధంగా ఉంది.

ఎక్కడో ఉన్న స్నేహితుడికి ఫేస్‌బుక్‌లో పొడిపొడిగా హాయ్ చెప్పడమో, బాయ్ చెప్పడమో అన్నది పాతమాట. ఇకనుంచీ ఓ వర్చువల్ కుర్చీమీద ఎదురెదురుగా కూర్చుని.... వర్చువల్ కాఫీ తాగుతూ బోలెడన్ని కబుర్లు చెప్పుకోవచ్చు. వర్చువల్ రియాలిటీ సాయంతో సోషల్ నెట్‌వర్కింగ్ రూపురేఖల్నే మార్చేయాలని అనుకుంటోంది ఫేస్‌బుక్. శాన్‌జోస్‌లో జరిగిన డెవలపర్స్ కాన్ఫరెన్స్‌లో తన వ్యూహాన్ని చూచాయగా వెల్లడించింది ఆ సంస్థ. అలా అని, ప్రస్తుతం అందుబాటులో ఉన్న ఓచిన్న అట్టపెట్టెలాంటి వీఆర్ హెడ్‌సెట్‌తోనే బండి నడిపించడం జుకెర్‌బర్గ్‌కు ఇష్టం లేదు. చాలా తేలిగ్గా, అచ్చంగా కళ్లజోడులా ఉండాలన్నదీ, ఉండటమే కాదు... కళ్లజోడులానూ పనికి రావాలన్నదీ జుకెర్ ఆలోచన. ఆ వైపుగా ప్రయోగాలు జరుగుతున్నాయి.

'టెలిపోర్ట్' కనుచూపుమేరలో కనిపిస్తున్న మరో అద్భుతం. 'టెలిగ్రామ్'... ఎవరో పంపిన సందేశం ఎంతోదూరం ప్రయాణించి మీ దగ్గరికి వస్తుంది. 'టెలిఫోన్'... ఎక్కడి స్వరమో గాల్లో తేలుతూ తేలుతూ వచ్చి నీ చెవిన పడుతుంది. అచ్చంగా అలాగే, టెలిపోర్ట్‌లో... మనిషి భౌతికంగా ఉన్నచోటనే ఉంటాడు. భావనాత్మకంగా మాత్రం... అనుకున్న చోటికి వెళ్లిపోతాడు. అక్కడ వర్చువల్‌గా సంభాషించడమే కాదు. సంతకాలు చేస్తాడు. ఒప్పందాలు కుదుర్చుకుంటాడు. ఏ వైద్యుడో అయితే ఆపరేషన్లు కూడా చేస్తాడు.

నమ్మాలనిపించడం లేదా?-

నిన్నమొన్నటి దాకా 'వర్చువల్ రియాలిటీ'ని మాత్రం ఎవరు నమ్మారు కనుక!

**- సండే డెస్క్**














# మిక్చర్ పొట్లం

బొమ్మలు : **వెంకట్**

## అంతే తేడా!

"ఏకలవ్యుడికీ మీకూ తేడా ఏమిట్రా?" అడిగాడు మాస్టారు.

"మేము వేలు పోసి చదువుకుంటున్నాం. ఆయన



వేలు కోసి చదువుకున్నాడు సార్" చెప్పాడు చంటబ్బాయ్.

## మొదటి మహిళ

"భారతదేశం నుండి మొదటిసారి విదేశం వెళ్లిన మహిళ ఎవరో తెలుసా?"

"సీత టీచర్ .. శ్రీలంక వెళ్లింది".

## రూల్స్ ఒప్పుకోవు!



**ఆ** గ్రామంలో జనాలు దేవుడికి పూజలు చేయడం చూసిన ఒక గాడిద తనూ పూజలు మొదలెట్టింది. దాని పూజలు ఫలించి దేవుడు ప్రత్యక్షమై ఏం కావాలో కోరుకోమన్నాడు.

"తర్వాత జన్మలో కూడా నన్ను గాడిదగానే పుట్టించు స్వామీ" కోరింది గాడిద.

"వరసగా రెండు జన్మల్లో ఒకేలా పుట్టించడం కుదరదు. రూల్స్ ఒప్పుకోవు. మరేదైనా వరం కోరుకో" అన్నాడు దేవుడు.

"అయితే, భర్తగా పుట్టించు స్వామీ" కోరింది గాడిద.

"ఎదవ తెలివితేటలు చూపించకు. రెండు జన్మల్లో ఒకేలా పుట్టించడం కుదరదని ఇందాకే చెప్పాను కదా" చిరాకుపడి అదృశ్యమయ్యాడు దేవుడు.

## ఎందుకు చెప్మా!

**పా**ల వాళ్లు ధర్నా చేస్తే పాలు రోడ్డుపైన పారబోస్తారు. కూరగాయల వాళ్లు ధర్నా చేస్తే కూరగాయలు పారబోస్తారు. మరి ఈ బ్యాంకు వాళ్లకు ఏమొచ్చిందో .. ఉట్టినే ధర్నా చేస్తారు?

**- మిస్టర్ సందేహం**

## దూరాలోచన



**మం**దు బాటిల్ కొనుక్కుని బైక్ ఎక్కబోతుండగా అనుమానం వచ్చింది వెంకటస్వామికి - ఒకవేళ బైక్ మీద నుండి పడిపోతే బాటిల్ పగిలిపోతుందేమోనని అక్కడే తాగేసి ఇంటికి బయల్దేరాడు. మధ్యలో బైక్ మీదనుండి పడి హాస్పటల్‌లో చేరాడు. మెలకువ వచ్చాక 'ముందే మందు కొట్టడం మంచిదైంది. లేకపోతే అనవసరంగా బాటిల్ పగిలిపోయి ఉండేది' తనను తాను అభినందించుకున్నాడు వెంకటస్వామి.

## దేవుడు వరమిచ్చినా ...



**చూ**డు తమ్ముడూ, మనం తినే ప్రతి మెతుకునూ భగవంతుడు నిర్ణయిస్తాడు. కానీ ఆ మెతుకు బిర్యానీ మెతుకా, లేక సద్దన్నం మెతుకా అనేది భార్య నిర్ణయిస్తుంది!

RAMACHARI

# పిల్లలకు సంగీతం నేర్పడం దైవారాధనే కదా!

**గీతామాధురి, దీపూ, ఇర్ఫాన్, కృష్ణచైతన్య, ప్రణవి, రోహిత్, రమ్య బెహరా, సత్య యామిని, దామిని... ఇలా గాయకులుగా రాణిస్తున్న ఎవరైనా వేదికలపై కృతజ్ఞతాపూర్వకంగా చెప్పే పేరు ఒకటే... రామాచారి. 'ఆయన దగ్గర సంగీత పాఠాలు నేర్చుకునే ఈ స్థాయికి ఎదిగామ'ని గర్వంగా చెబుతుంటారు. ప్రస్తుతం సినిమాల్లో, టీవీల్లో, స్టేజీషోల్లో, కోరస్‌లో పాటలు పాడుతూ బిజీ సింగర్లుగా గుర్తింపు తెచ్చుకుంటున్న ఎంతోమంది రామాచారి 'లిటిల్ మ్యుజీషియన్స్ అకాడమీ' (ఎల్ఎంఎ)లోనే తొలుత గళాలు సవరించుకున్నారు. ఆయన సలహాలు, సూచనలతోనే ప్రొఫెషనల్ సింగర్స్‌గా పేరు తెచ్చుకున్నారు. గత 19 ఏళ్లుగా అనేక పిల్ల కోయిలలకు మావిచిగురు తినిపిస్తున్న సంగీత గురువు రామాచారి స్వర ప్రయాణంలోని సరిగమలివి...**

**నా** పూర్తి పేరు కొమాండూరి రామాచారి. మాది మెదక్ జిల్లా శివంపేట మండలంలోని పెద్దగొట్టిముక్కల అనే చిన్న పల్లెటూరు. మా నాన్నగారు కొమాండూరి కృష్ణమాచార్యులు వేద పండితులు. ఊళ్లో పౌరోహిత్యం చేసేవారు. ఆయన హరికథాగానం చేస్తుంటే నేను సహకారగానం చేసేవాణ్ణి. ఆయన నోటి నుంచి వచ్చే మంగళహారతులన్నీ నాకు కంఠస్థమే. పండగలకూ పబ్బాలకూ ఊళ్లో ఏర్పాటుచేసే యక్షగానాలు, కోలాటాలు, ఒగ్గుకథలు, చెక్క భజనలు... ఇలా అన్నింట్లోనూ పాల్గొనేవాణ్ణి. మా ఊరిని ఆనుకుని నర్సాపూర్ అడవులు మొదలవుతాయి. నేను ప్రకృతి ఒడిలో పెరిగాను. పక్షిలా తిరిగాను. మోటబావుల్లో ఈత కొట్టడం, అడవిలో కోతులు ఎక్కినట్టే చెట్లు ఎక్కడం నా దినచర్యలో భాగం. ఆటల మీద ఉన్నంత శ్రద్ధ చదువు మీద ఉండేది కాదు. చదువు ఒంటపట్టక పదవ తరగతి ఫెయిలయ్యాను. అయితే ఎక్కడ ఏ వాయిద్యం చప్పుడు వినిపించినా అక్కడికి పరిగెత్తేవాణ్ణి. దూరం నుంచి వంత పాడేవాణ్ణి. అనుకరించేవాణ్ణి. సంగీతంలో నా తొలిగురువు మా నాన్నగారైతే, మలి గురువు జానపద కళారూపాలు. మా ఊళ్లో కురుమలు, గొల్లలు ఉండే వీధిలో ఇరవైదాకా మగ్గాలుండేవి. వాటిపై గొంగళ్లు నేసేవారు. వాటి మధ్య నిల్చుని నేను పాటలు పాడుతుంటే వాళ్లంతా ముచ్చటపడి నాకు వేడి వేడి పాలు, వెన్న, పెరుగు పెట్టేవారు. 'పంతులు కొడుకు' అని ముద్దుగా పిలిచేవారు.

### భారతి మేడమ్ మాటతో...

చదువు ఎలాగూ లేదు కాబట్టి నాన్నకు చేదోడువాదోడుగా ఉంటూ మూడు ఊళ్లలో పౌరోహిత్యం చేసేవాణ్ణి. సరిగ్గా అదే సమయంలో, ఒక ఎన్జీవో ఏవో కార్యక్రమాలు ప్రచారం చేస్తూ మా ఊరికి వచ్చింది. అందులో భారతి అనే మేడమ్ ఉండేది. నా పాటలు విని ప్రచారంలో నన్ను కూడా పాల్గొనమనేది. తను సికింద్రాబాద్‌లో వీణ నేర్చుకున్నట్లు చెప్పి, నన్ను కూడా మ్యూజిక్ స్కూల్‌లో చేరమని సలహా ఇచ్చింది.

ఆమె సలహాతో, ఒకరోజు ఇంట్లో చెప్పకుండా పక్కింటోళ్ల దగ్గర 15 రూపాయలు అప్పుచేసి హైదరాబాద్ బస్సెక్కాను. బస్టాండులో నాకు పరిచయమున్నవాళ్లు కలిస్తే, హైదరాబాద్‌లోని నా మిత్రుడు బిక్షపతి దగ్గరకు వెళ్తున్నట్టుగా నాన్నకు చెప్పమన్నాను. బిక్షపతిని కలిసి అడ్రస్ వెతుక్కుంటూ భారతి మేడమ్ దగ్గరకు వెళ్లాను. ఆమె నన్ను మారేడ్‌పల్లిలో ఉన్న భక్తరామదాసు సంగీత కళాశాలకు తీసుకెళ్లింది. నా దురదృష్టమేమిటంటే అప్పటికే అడ్మిషన్లు అయిపోయాయి. అప్పట్లో ఆ కళాశాలకు నూకల చినసత్యనారాయణగారు ప్రిన్సిపాల్‌గా ఉండేవారు. భారతి మేడమ్ రిక్వెస్ట్‌తో నా పాట వినేందుకు ఒప్పుకున్నారు. 'ఘనా ఘన సుందరా...' అంటూ పాడితే నా స్వరం బాగుందని ప్రత్యేక పర్మిషన్‌తో చేర్చుకున్నారు.

సంగీత కళాశాలలో చేరానుగానీ ఉండటానికి డబ్బుల్లేవు. మోండా మార్కెట్ దగ్గర మా ఊరి వాళ్లు కొందరు ప్రైవేట్ ఉద్యోగాలు చేస్తూ రూమ్ తీసుకుని ఉండేవాళ్లు. వాళ్లను బతిమిలాడి రూములో పనంతా నేనే చేస్తాననీ, రెండు పూటల తిండి పెడితే చాలనీ చెప్పాను. అందుకు వాళ్లు ఒప్పుకున్నారు. సంగీతం క్లాసులు సాయంత్రం ఉండేవి కాబట్టి రోజంతా రూమ్‌లో సాధన చేసేవాణ్ణి. రోజూ రేడియో వినేవాణ్ణి. దాంతో రేడియోలో ఒక్క పాటైనా పాడాలనే కోరిక బలంగా ఉండేది. రేడియో స్టేషన్‌కు వెళితే 'రేడియో అక్కయ్య' తురగా జానకీరాణిగారు పరిచయమయ్యారు. నన్ను చాలా బాగా ఆదరించారు. అక్కడే ఓరుగంటి లీలావతిగారు (క్లాసికల్), పి.వి.సాయిబాబు (లలిత సంగీతం) పరిచయమయ్యారు. వారి





శిష్యరికంలో అనేక మెలకువలు నేర్చుకున్నాను. వారిద్దరూ నా సంగీతానికి సానబెట్టిన గురువులు. ఈ లోపు పదవ తరగతి పాసై, ఇంటర్‌లో చేరాను. రేడియో అనుభవంతో నెమ్మది నెమ్మదిగా దూరదర్శన్‌లో కూడా అవకాశాలొచ్చాయి. దాంతో రామాచారిగా నాకు గుర్తింపు వచ్చింది. ఆ గుర్తింపుతో కృష్ణ, నీరజ్ ఆర్కెస్ట్రాలో వేదికపై పాటలు పాడేవాణ్ణి. లాలాపేటలోని 'తక్షశిల' సంగీత పాఠశాలలో విద్యార్థులకు పాఠాలు బోధించేవాణ్ణి.

**సంగీతం మాస్టారుగా...**

నేను డిగ్రీ (బీఏ) ఫైనలియర్‌లో ఉండగా మా ఊళ్లో విపరీతమైన కరువొచ్చింది. ఇళ్లల్లో దొంగలు పడి దోచుకుపోయేంత కరువు. మా ఇంట్లో కూడా దొంగలుపడి మొత్తం ఊడ్చుకుపోయారు. దాంతో నాన్నను ఒప్పించి, కుటుంబాన్ని హైదరాబాద్‌కు షిఫ్ట్ చేశాను. కొంతకాలం అనేక కష్టాలు పడిన తర్వాత బౌద్ధనగర్‌లోని ఒక గుడిలో నాన్నగారికి పూజారిగా అవకాశం వచ్చింది. ఈ లోపు నేను మ్యూజిక్‌లో టీటీసీ చేశాను. ఆబిడ్స్‌లోని ఆల్‌సెయింట్స్ హైస్కూలులో సంగీతం మాస్టారుగా పర్మినెంట్ ఉద్యోగం దొరికింది. ప్రస్తుతం బాలీవుడ్ సింగర్‌గా ఉన్న ఇర్ఫాన్‌తో పాటు, హేమచంద్ర కూడా ఆ స్కూల్లో చదువుకుంటూ సంగీతంలో నా దగ్గర శిష్యరికం చేసినవారే. ఆర్థికంగా కాస్త నిలదొక్కుకున్న తర్వాత నా సంగీత గురువు ఒరుగంటి లీలావతిగారి అక్క కూతురు సుజాతతో నా పెళ్లి జరిగింది.

**'పాడుతా తీయగా' ఫస్ట్ బ్యాచ్...**

తెలుగులో ప్రైవేట్ చానల్స్ అప్పుడప్పుడే అడుగుపెడుతున్నాయి. ప్రసిద్ధ గాయకుడు బాలసుబ్రహ్మణ్యంగారి ఆధ్వర్యంలో ఈటీవీలో 'పాడుతా తీయగా' ప్లాన్ చేశారు. ఆడిషన్స్‌లో 'శంకరాభరణం' సినిమాలోని 'రాగం తానం పల్లవి' అనే పాట పాడి సెలెక్టయ్యాను. ఆ తర్వాత 60 ఎపిసోడ్లలో ఒక్కో మెట్టు ఎక్కుతూ ఫైనల్స్‌లో రన్నరప్‌గా (పార్థసారథి విన్నర్) నిలిచాను. లేడీసింగర్స్‌లో ఉష విన్నరయ్యింది. 'పాడుతా తీయగా' మా ముగ్గురికి ఎంతో పేరు తీసుకొచ్చింది. అప్పట్లో సినిమా ఇండస్ట్రీ మొత్తం చెన్నైలోనే ఉండేది. ప్లేబ్యాక్ సింగర్‌గా మారాలంటే చెన్నైకి వెళ్లాలి. సరిగ్గా అదే సమయంలో నాన్నకు సీరియస్‌గా ఆస్తమా అటాక్ కావడం, చెల్లెలు క్యాన్సర్‌తో చనిపోవడం నా జీవితంలో పెద్ద కుదుపు.

- భోజనప్రియుణ్ణి. జంక్‌ఫుడ్ జోలికి వెళ్లను.
- స్పోర్ట్స్ చూడటం ఇష్టం. వాలీబాల్ ప్లేయర్ని కానీ ఎత్తు తక్కువగా ఉండటం వల్ల ఆ ఆట నుంచి విరమించుకున్నా.
- మెలోడీస్ బాగా వింటాను. పాతవైనా కొత్తవైనా సరే.
- నాకు సంగీతం ఇష్టమైతే నా భార్య సుజాతకు సాహిత్యమంటే ఇష్టం. ప్రస్తుతం తను 'విశ్వనాథ్ సినిమాల్లో సాహిత్య, సంగీత విలువలు' అనే సబ్జెక్టుపై ఓయూలో పీహెచ్‌డీ చేస్తోంది.

**'లిటిల్ మ్యుజీషియన్స్ అకాడమీ' ఆవిర్భావం...**

స్కూలులో ఎలాగూ సంగీత పాఠాలు బోధిస్తున్నాను కాబట్టి బయట కూడా నేర్పించమని కొందరు తల్లిదండ్రులు కోరారు. నల్లకుంటలోని ప్రసిద్ధ రచయిత, విమర్శకుడు జి.వి.సుబ్రహ్మణ్యంగారి ఇంటి వరండాలో 12 మంది పిల్లలకు సంగీత పాఠాలు చెప్పేవాడిని. అదే సమయంలో సంగీత దర్శకులు ఆర్పీ పట్నాయక్, చక్రిలకు మ్యూజిక్ కండక్ట్ చేసేవాణ్ణి. నా దగ్గరున్న పిల్లలతో కోరస్, బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ కో ఆర్డినేట్ చేసేవాణ్ణి. దాంతో సినిమా సంగీతానికి ఏం కావాలో తెలిసింది. కార్గిల్‌వార్ సహాయనిధి కోసం హైదరాబాద్‌లో పెద్ద కార్యక్రమం ఏర్పాటుచేస్తే, అందులో సంగీత కార్యక్రమ నిర్వహణ బాధ్యతను బాలుగారు నాకు అప్పగించారు. అందులో నా శిష్యులనందర్నీ ఇన్వాల్వ్ చేశాను. సినిమా ఇండస్ట్రీకి అవసరమైన టాలెంట్ ఇక్కడ లేదంటూ కొంతమంది విమర్శిస్తుంటే బాధపడి, బాలుగారితో 'లిటిల్ మ్యుజీషియన్స్ అకాడమీ' గురించి చర్చించాను. ఆయన ఆశీస్సులతో 1998లో 'ఎల్ఎంఏ'ను స్థాపించాను. ఎవరి దగ్గరా ఒక్క పైసా కూడా తీసుకోకుండా సంగీత బోధన చేయాలనుకున్నా. నేను ఈ స్థితికి రావడానికి నాకు ఎంతోమంది సాయం చేశారు కాబట్టి 'థాంక్స్ గివింగ్' కార్యక్రమంగా 'ఎల్ఎంఏ'ను ఎంచుకున్నా. పిల్లలకు నేర్పడానికి అవసరమైన సిలబస్‌ను నా అనుభవం ద్వారా నేనే రాసుకున్నా. ఒకవైపు పిల్లలకు సంగీతంలో మెలకువలు నేర్పుతూనే నేను కూడా చాలా నేర్చుకున్నా. క్రమక్రమంగా తెలుగులో చానళ్లు పెరిగాయి. మ్యూజిక్ షోలు, రియాల్టీషోలలో నా శిష్యుల సంఖ్య కూడా పెరిగింది. సినిమాల్లో కొత్త గళాలకు ఆదరణ పెరిగింది. ప్రస్తుతం సినిమా, టీవీల్లో పాడుతున్నవారిలో 80 శాతం పైగా నా శిష్యులే కావడం విశేషం.

నాలుగంచెల్లో నేను పిల్లలకు సంగీతంలో శిక్షణ ఇస్తా. గ్రేడ్ 1,2,3 తర్వాత ప్రొఫెషనల్స్‌గా మారతారు. ప్రతీ ఆదివారం ఆంధ్రమహిళా సభలో ఉదయం 10 గంటల నుంచి సాయంత్రం 6 గంటల దాకా శిక్షణ ఇస్తుంటాను. అన్ని లెవల్స్‌లోని వారికి వాట్సాప్ గ్రూప్ ఉంటుంది. దాని ద్వారా వారికి సిలబస్ ఇస్తుంటా. అమెరికాలో కూడా ప్రతీ యేడాది రెండు నెలలపాటు క్లాసులు నిర్వహిస్తున్నా. అమెరికాలో స్టేజీషోలు ఏర్పాటుచేసి, 'ఎల్ఎంఏ' నిర్వహణకు కొంత కార్పస్ ఫండ్ ఏర్పాటుచేసుకున్నాం. నాకు స్టూడియో ఉంది కాబట్టి రికార్డింగులు, ఇతర కార్యక్రమాల ద్వారా వచ్చే ఆదాయంతో నా లైఫ్ హ్యాపీగా గడిచిపోతోంది. నాకు ఇద్దరు పిల్లలు సాకేత్, సోనీ ('బాహుబలి2' లో హంసనావ పాడింది). వాళ్లిద్దరూ ప్లేబ్యాక్ సింగర్స్‌గా ఇండస్ట్రీలో ఇప్పుడిప్పుడే మంచి పేరు తెచ్చుకుంటున్నారు. పిల్లలకు సంగీతాన్ని నేర్పడమంటే దైవారాధనతో సమానమే కదా!

● **చల్లా శ్రీనివాస్**



క్రైమ్ స్టోరీ

# ఈ-మెయిల్ టర్నింగ్

కాండివిలిలో బయటపడ్డ అవశేషాల్నిబట్టి రాతియుగంలోనే ఈ ప్రాంతం జనావాసమని నిర్ధారణ అయింది. పశ్చిమ ముంబయిలోని కాండివిలి ఇప్పుడు అత్యంతాధునిక కట్టడాలున్న రద్దీ ప్రాంతం. రాతియుగంలో పుట్టాల్సిన ఓ ఐదుగురి ఉనికి మాత్రం ఇంకా అక్కడి నాగరికతను వెక్కిరిస్తోంది.



45 ఏళ్ల కుమోద్ ఫ్రెండ్‌తో కలిసి హోటల్‌కెళ్ళాడా రాత్రి. పిచ్చాపాటీ మాట్లాడుతూ డ్రింక్ చేశారిద్దరూ. కాసేపటి తర్వాత బయటికొచ్చారు. అక్కడ పాతిక ముప్ఫై ఏళ్ల లోపున్న ఐదుగురు యువకులు నిలబడి ఉన్నారు. వాళ్ళ పక్క నుంచి పోతున్నపుడు కుమోద్ చెయ్యి ఒకడికి తగిలింది.

"ఏయ్!" అని కొట్టబోయాడు వాడు.

"సారీ భాయ్" అన్నాడు కుమోద్ మత్తుగా.

"సారీ ఏంది బే, సారీ...?" మీదకు రాబోయాడు వాడు.

కుమోద్ ఫ్రెండ్ ఆపుతూ తను కూడా సారీ చెప్పాడు.

"నీ కీపా బే, చెయ్యేశావ్!' అని ఒక్కటి పీకాడు ఇంకొకడు కుమోద్‌ని. వెంటనే మరో ఇద్దరు మొనదేలిన రాళ్ళెత్తుకుని కుమోద్ మీద దాడి చేశారు. తూలి బోర్లాపడ్డ కుమోద్ తల మీద రాళ్ళతో మోదారు. క్షణాల్లో అక్కడ్నించి పారిపోయారు.

• • •

రక్తమోడుతున్న కుమోద్‌ని చూసి కంగారు పడింది అతడి భార్య. భయం భయంగా ఆమెకి ఏదో చెప్పి తక్షణం ఆటో కోసం పరుగెత్తాడు ఫ్రెండ్. ఆటో దొరక్క కంగారు పడుతూంటే పోలీస్ పెట్రోలింగ్ కారొచ్చింది. వాళ్ళు ఎక్కించుకుని హాస్పిటల్‌కి చేర్చారు. అప్పటికే ప్రాణాలతో లేడు కుమోద్.

మర్నాడు అంత్యక్రియలు జరిగాయి. భారంగా రోజులు గడుస్తున్నాయి కుమోద్ భార్యకి. కుమోద్ తాగిన మైకంలో కింద పడ్డ ఫలితంగా జరిగిన మరణమని పోలీసులు కేసు మూసేశారు. ఇరవై రోజుల తర్వాత, ముంబయి పోలీస్ కమిషనర్‌కి ఒక ఈమెయిల్ అందింది. అది చూసి వెంటనే క్రైమ్ బ్రాంచ్‌ని అలర్ట్ చేశాడు. సీనియర్ క్రైమ్ ఇన్‌స్పెక్టర్ చిమాజీ ఆధవ్ ఆఘమేఘాల మీద రంగంలోకి దిగాడు.

"అలా పడిపోలేదాయన, వాళ్ళే నెట్టేశారు. రాళ్ళతో దాడి చేశారు. వాళ్ళల్లో ఒకడు పప్పీ అని తెలిసింది" అంది కుమోద్ భార్య ఇంటికొచ్చిన ఇన్‌స్పెక్టర్ చిమాజీతో.

"పప్పీ ఎవరు?"

"హత్య కేసుంది వాడి మీద"

"ఏం చేస్తూండేవారు మీ ఆయన?"

"ప్రాపర్టీ డీలర్"

కుమోద్ ఫ్రెండ్‌ని కూడా విచారించాడు ఇన్‌స్పెక్టర్. అతను జరిగిందంతా చెప్పేసరికి పప్పీ డేటా తీశాడు చిమాజీ. ఒక మర్డర్ కేసులో బెయిల్ మీదున్నాడు పప్పీ. ఆ ఫోటో తీసుకుని హోటల్ కెళ్ళాడు. హోటల్ ఓనర్ ఆనాటి ఫుటేజీ అందించాడు. ఆ సీసీ కెమెరా ఫుటేజీలో సీనంతా కనపడింది చిమాజీకి. వెంటనే దోషుల మగ్ షాట్స్ తీయించి క్రైమ్‌బ్రాంచ్‌కి అందించాడు. ఆ ఐదుగురిలో పప్పీ తర్వాత ఇంకొకణ్ణి మాత్రమే గుర్తించగల్గారు టెక్నీషియన్స్. అతను జీతేష్. ఒక మర్డర్ కేసులో పదేళ్ళు జైలుకెళ్ళి ఇటీవలే విడుదలయ్యాడు. మిగతా ముగ్గురెవరో రికార్డ్స్ లేవు. వాళ్ల అరెస్టులకి రంగం సిద్ధం చేశాడు ఇన్‌స్పెక్టర్ చిమాజీ.

• • •

"నువ్వేమో బెయిల్ మీద ఉన్నావు, నువ్వుకూడా పదేళ్ళు లోపలుండి వచ్చావు. మిగతా ముగ్గురూ వెధవలే. మిమ్మల్ని బుద్ధిమంతులుగా ఎలా చూపించాలయ్యా?" అన్నాడు దర్శన్ సేఠ్. పప్పీ, జీతేష్‌లతోబాటు హార్దిక్, అమిత్, వినోద్‌లు కూడా ఎదురుగా కూర్చుని వున్నారు.

"సీనెందుకేసుకున్నారయ్యా సీసీ కెమెరా ముందు? సీనేసుకునేది మీరు, కాపాడేది నేనా?' అన్నాడు మళ్ళీ దర్శన్ సేఠ్.

"ఈ మెయిల్ వల్లే కేసు రీ ఓపెన్ అయింది సేఠ్. ఎవరు పంపారో, ఏమని పంపారో పేపర్లో రాలేదు"

"ఎందుకలా భయపడతారయ్యా? అరెస్టయితే అరెస్టయిపోండి. మీరు బుద్ధిమంతులే అని నమ్మించండి. వాడు 'గే' అనండి, మీరు కాదు. వాడు మిమ్మల్ని టచ్ చేశాడు. మీరు ఆత్మరక్షణ చేసుకున్నారు. ఒకమ్మాయిని టచ్ చేస్తే చట్టం ఎలా చూస్తుందో, మిమ్మల్ని ఒక 'గే' టచ్ చేసినా అలాగే చూస్తుందని నమ్ముదాం, మీరు సేఫ్..."

బుర్ర తిరిగిపోయింది ఐదుగురికీ.

"ఇది మంచిది కాదు సేఠ్. ప్రాపర్టీ కోసం కుమోద్‌ని మాచేత అలా చంపించింది మీరే. యాక్సిడెంటల్‌గా వుండాలన్నారు. అలాగే చేశాం. ఇప్పుడు మా మీద తోసేసి మీరు తప్పుకోవడం మంచిది కాదు"

"ఏంట్రోయ్, మిమ్మల్ని నమ్ముతారనా పోలీసులూ? మీకు నేను సుపారీ ఇచ్చినట్టు ఎక్కడుందిరా? మీరెవరసలు? ఏదో తప్పు చేశాం కాపాడమని వస్తే... నాకు తోచింది చెప్పా"

"సేఠ్, ఈ మెయిల్లో మీ పేరుందేమో తెలుసుకోండి"

ఎగబడి పప్పీ కాలర్ పట్టుకున్నాడు దర్శన్ సేఠ్.

"ఏంట్రా... ఈమెయిల్, ఈమెయిల్ అంటున్నావ్? కొంపదీసి నువ్వే పంపావా? నేను సరిగ్గా ఇరుక్కోవడం లేదని ఇరికించడానికి...."

"నువ్విరుక్కున్నావ్ సేఠ్, ఇప్పుడు బాగా ఇరుక్కున్నావ్!" అని కాలర్ ఊడలాక్కుని పప్పీ బయటికి ఉరుకుతూంటే, మిగిలిన వాళ్ళూ అతడి వెనుక పరిగెత్తారు. ఏం జరుగుతోందో అర్థంగాక అరుస్తూ దర్శన్ సేఠ్ కూడా బయటికి వచ్చేశాడు.

బయట పప్పీని దొరికించుకుని ఫెడీల్మని కొట్టాడు ఇన్‌స్పెక్టర్ చిమాజీ. జేబులో ఉన్న పెన్ను లాక్కున్నాడు.

"ఏంట్సార్... ఈ హెల్ప్ చేయమని చెప్పి నన్నే కొడతారు?" అంటూ తిరగబడ్డ పప్పీనీ, మిగతా గ్యాంగునీ కొట్టుకుంటూ లాక్కెళ్ళి వ్యానులో పడేశారు పోలీసులు వాళ్ళ పద్ధతి ప్రకారం.

విస్తుపోయి చిమాజీనే చూస్తున్నాడు దర్శన్ సేఠ్.

"పద! ఈ కెమెరాలో బాగానే యేసుకున్నావ్ సీను!" అంటూ పెన్ను రూపంలో ఉన్న స్పై కెమెరాని చూపించసాగాడు చిమాజీ.

పారిపోబోయాడు దర్శన్ సేఠ్, కానీ పోలీసులు పట్టుకున్నారు.

రెండు రోజుల తర్వాత...

బీహార్‌లో ఉన్న నిర్మలాదేవీ ఝా, ఇంకో ఈమెయిల్ పంపుతోంది ముంబయి పోలీస్ కమిషనర్‌కి. 'సర్... అది యాక్సిడెంట్ కాదు, హత్య అన్న నా అనుమానాన్ని మన్నించి కేసు రీ ఓపెన్ చేసినందుకు ధన్యవాదాలు. మీ అపూర్వ ప్రతిభతో నా కుమారుడిని చంపిన హంతకుల్ని త్వరగా పట్టుకున్నందుకు థాంక్స్...'

**- సికిందర్**



# ‘ఆత్మ’ల వేటగాళ్లు!

**ఆత్మల ఆచూకీ కనిపెట్టి, వాటి పనిపట్టే ‘పారానార్మల్’ పరిశోధకులు ‘దెయ్యాల’ కోర్సులు చదువుకుని మరీ రంగంలోకి దిగుతున్నారు. ఆధునిక పరికరాలతో, శాస్త్రీయ పద్ధతుల్లో ఆత్మల అంతు చూస్తామంటున్నారు.**

అమెరికాలో ఉండే ఒక టెక్కీ (సాఫ్ట్‌వేర్ ఇంజనీర్)కి మధ్యాహ్నం ఫోనొచ్చింది. అప్పుడు ఇండియాలో తెల్లవారుఝామున మూడు గంటలవుతుంది. ‘ఈ సమయంలో ఫోన్ ఎందుకు చేశారబ్బా...?’ అనుకుంటూ ఫోనెత్తాడు. అవతలి వైపు తల్లి మాట్లాడుతోంది. “ఈ టైములో ఫోన్ చేశావేంటీ... అంతా ఓకే కదా...” అనుమానంగా అడిగాడు. అంతే... అటువైపు తల్లి రెచ్చిపోయింది. “ఏం... నా కొడుకుతో నేను మాట్లాడకూడదా? దానికి టైం చూసుకోవాలా?” అంటూ గట్టిగా అరుస్తూ ఫోన్ పెట్టేసింది. టెక్కీ ఆశ్చర్యపోయాడు. ఇంతకు ముందు తన తల్లి ఎప్పుడూ అంతలా అరుస్తూ మాట్లాడలేదు.

వెంటనే ఇంటికి ఫోన్ చేశాడు. తండ్రి ఫోన్ తీశాడు. ఐదు నిమిషాల క్రితం అమ్మ ఫోన్ చేసిందని చెప్పాడు. “ఆమె ఒక వైపు హాయిగా నిద్రపోతుంటే ఫోన్ చేసిందని అంటావేరా... పైగా తెల్లవారుఝామున మూడవుతోంది. ఇప్పుడెవరైనా ఫోన్ చేస్తారా?” అన్నాడు.

టెక్కీకి ఏం అర్థంకాలేదు. ఫోన్‌లో తల్లి మాటలు స్పష్టంగా వినిపించాయి. తన మొబైల్‌లోని కాల్‌లాగ్‌ను తండ్రికి వాట్సాప్‌లో పంపాడు. కానీ ఆ ఫోన్ తాము చేయలేదని కచ్చితంగా చెప్పారు. మరుసటి రోజు టెక్కీ తండ్రి టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌కు వెళ్లి కాల్‌లిస్ట్ ప్రింటవుట్ తెచ్చాడు. అందులో వారం రోజులుగా అమెరికాకు ఒక్క కాల్ కూడా చేసిన దాఖలా కనిపించలేదు. మొదట్లో అదేదో ‘ఎక్స్ఛేంజీ లీల’గా లైట్ తీసుకున్నారు కానీ తర్వాత రెండు వారాల పాటు వరుసగా ఇంట్లో జరిగిన సంఘటనలు సైకాలజిస్టును కలిసేలా చేశాయి. ఆ తర్వాత భయంతో భూత వైద్యులను కూడా ఆశ్రయించారు. అర్థరాత్రి డోర్‌బెల్ అదేపనిగా మోగడం, బెడ్‌రూమ్ తలుపులు గట్టిగా కొట్టుకోవడం వంటివి చూస్తే ఇంట్లో ఆత్మలు తిరుగుతున్నట్లుగా ఫిక్సయ్యారు.

“ఆ ఇంట్లో ఎక్కువ మొత్తంలో విద్యుదయస్కాంత శక్తులు తిరుగుతున్నాయన్నమాట. ఇంట్లో జరిగిన పరిణామాలకు ఈ శక్తులే కారణం” అని అక్షయ్ స్థాలేకర్ విశ్లేషించారు. ఈయన ‘ఇండియా పారానార్మల్ టీమ్’ వ్యవస్థాపకుడు. సదరు టెక్కీ ఇంట్లో శుద్ధి కార్యక్రమాలు చేసి ఆ ఇంట్లో నుంచి దుష్టశక్తులను తరిమేశారు.

**ఇంతకీ అవి దెయ్యాలేనా...?**

“వాటిని దెయ్యాలనకుండా శక్తులంటాం. కొన్నిసార్లు అవి చనిపోయినవారివి కూడా కావొచ్చు” అంటారు బెంగళూరుకు చెందిన ‘స్పిరిట్ హంటింగ్ అండ్ రీసెర్చ్ ఇన్ పారానార్మల్’ వ్యవస్థాపకుడు రాహుల్‌కుమార్.

దెయ్యాల వేటగాళ్లు (ఘోస్ట్ హంటర్స్), అతీంద్రియశక్తుల పరిశోధకుల (పారానార్మల్ రీసెర్చర్స్) సంఖ్య బాగా పెరుగుతోంది. వీళ్లు పదో పరకో తీసుకుని, మంత్రించిన నిమ్మకాయో చిటికెడు బూడిదో ఇచ్చే మంత్రగాళ్లు ఎంతమాత్రం కాదు. చీకట్లో మన కళ్లకు కనిపించని శక్తులను (స్పిరిట్స్) ఫోటోలు తీసే ‘ఇన్‌ఫ్రా రెడ్ కెమెరా’, అతీంద్రియ శక్తులు మన చుట్టూ తిరుగుతున్నప్పుడు మారే వాతావరణాన్ని రికార్డు చేసే ‘థెర్మోమీటర్’, అదృశ్యశక్తి కనిపించగానే మెరిసే ‘మోషన్ డిటెక్టర్స్’, వింత శబ్దాలను రికార్డు చేసే ‘డిజిటల్ రికార్డర్స్’ వంటి ఆధునిక పరికరాలతో శాస్త్రీయంగా దెయ్యాల వేట సాగించే పరిశోధకులు. వీరికిప్పుడు చేతినిండా పని ఉంటోంది.

వీరి క్లయింట్లలో సినీతారలు, రాజకీయనాయకులు, బడా వ్యాపారులున్నారు. సమస్యను బట్టి ప్రాథమిక పరిశోధనకు 15 వేల రూపాయల నుంచి 20 వేల రూపాయలు వసూలు చేస్తున్నారు. ఆ తర్వాత దుష్ట శక్తులను పారద్రోలి, శాంతి చేకూర్చేందుకు 20 వేల రూపాయల నుంచి లక్ష రూపాయల వరకు డిమాండ్ చేస్తున్నారు.

పారానార్మల్ సైన్స్‌గా చెబుతున్న ఈ విద్య నేర్పించేందుకు చాలాచోట్ల ప్రత్యేకంగా సర్టిఫికెట్ కోర్సులు కూడా వెలిశాయంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఆయా కేంద్రాల్లో 50 వేల రూపాయల నుంచి 75 వేల రూపాయల ఫీజు తీసుకుని మూడు నుంచి ఆరు వారాల శిక్షణ ఇస్తున్నారు. విదేశాల్లో పాపులరైన ఈ అతీంద్రియశక్తుల పరిశోధన ఇప్పుడిప్పుడే మనదేశంలో కూడా ఊపందుకుంటోంది. దానికి తగ్గట్టుగా ‘మార్కెట్’ కూడా విస్తరిస్తోంది.

కొందరు పరిశోధకుల అంచనా ప్రకారం కుల్‌ధార (రాజస్థాన్), డమాస్ బీచ్ (గుజరాత్), భాన్‌గఢ్ కోట (రాజస్థాన్), శాన్వార్వాడా కోట (పుణే), లోనావాలా పాత రోడ్డు (ముంబయ్), లాంబ్ డెహర్ లేన్ (ముస్సోరి)లలో అతీంద్రియ శక్తులున్నాయట. ఆయా ప్రాంతాల్లో ఒక్కసారిగా వాతావరణం చల్లబడటం, చిన్ని పిల్లాడు ఏడుస్తున్న శబ్దాలు రావడం, పరుగెత్తుతున్న వ్యక్తి పాదాల శబ్దాల వంటి చర్యలు జరుగుతున్నట్టు వారు చెబుతున్నారు. అయితే అవన్నీ కూడా వదంతులేనని, ఇదొక సూడో సైన్సని, మనిషిలోని భయాన్ని క్యాష్ చేసుకుంటున్నారని కొట్టిపారేస్తున్నవాళ్లూ లేకపోలేదు.

గత యేడాది ‘ఇండియన్ పారానార్మల్ సొసైటీ’ వ్యవస్థాపకుడు గౌరవ్ తివారీ (సోనీటీవీలో ‘భూత్ ఆయా’ ప్రోగ్రామ్ గుర్తుందా) అనుమానాస్పద స్థితిలో మరణించడం కొసమెరుపు. ఆ యువకుడిని ఏ ‘ఆత్మ’ బలి తీసుకుందో ఎవరికీ తెలియదు. ✻





గౌరవ్ తివారీ



# జంతుదాదా ఎంబీబీఎస్

**ఆయుర్వేదం, హోమియోపతి, అల్లోపతి, యునానీ... ఎన్ని రకాల మందులు వాడినా ప్రయోజనం కనిపించట్లేదా..! ఎంబీబీఎస్, ఎమ్మెస్, ఎండీ, ఎఫ్ఆర్సీఎస్... ఎంతమంది డాక్టర్లకు చూపించినా లాభంలేదా? అయితే, ఒక్కసారి డాక్టర్ శునక్‌బాబునో, డాక్టర్ మార్జాలమ్మనో కలవండి. 'పెట్ థెరపీ'తో మీ రుగ్మత కాస్తా గాయబ్.**





మనుషులతో పెంపుడు జంతువుల అనుబంధం ఇప్పటిది కాదు. సేద్యానికి వాడుకున్నాడు. రవాణాకు ఉపయోగించుకున్నాడు. వేటకు తోడుగా తీసుకెళ్లాడు. కాలక్షేపానికీ పెంచుకున్నాడు. కాకపోతే, ఆ మమకారాన్ని ఓ చికిత్సా విధానంగా ఉపయోగించుకుంటున్నది మాత్రం ఇప్పుడిప్పుడే. అందులోనూ కుక్క... మనుషుల రోగాల్ని నయం చేయడంలో మహాదిట్ట. ఆ వైద్య బృందంలో పిల్లులూ, కుందేళ్లూ, గాడిదలూ, గుర్రాలూ, వివిధ రకాల పక్షులూ ఉన్నాయి. పెంపుడు జంతువులకు కనుక, నిపుణుల పర్యవేక్షణలో ప్రత్యేక శిక్షణ ఇస్తే... వివిధ మానసిక రోగాల్ని నయం చేస్తాయని తాజా వైద్య పరిశోధనలు నిరూపిస్తున్నాయి. పుణె, ముంబయి తదితర నగరాలలో మొదలై, ఇప్పుడిప్పుడే దేశమంతటా విస్తరిస్తోంది 'పెట్ థెరపీ'.

ఆరేళ్ల నానీ ఇంటి ముందు ఆడుకుంటూ కిందపడ్డాడు. కాళ్లకు దెబ్బలు తగిలాయి. చికిత్స చేసిన రెండు రోజుల తర్వాత, వ్యాయామం అవసరమనీ, కాళ్లను కదిలించమనీ పెద్ద డాక్టరు చెప్పాడు. బాగా నొప్పిగా ఉందంటూ, కాలు కదపకుండా మొండికేశాడు బుడ్డోడు. దీంతో, నాలుగుకాళ్ల డాక్టర్‌గారు దర్జాగా రౌండ్స్‌కి వచ్చారు. వస్తూనే నానీ దగ్గరికెళ్లి ఆడుకుందాం రమ్మంటూ బంతిని చూపించారు. అంతే... నానీగాడు గాయాల విషయం మరిచిపోయి, ఆ డాక్టరు వెనకాలే పరిగెత్తుకుంటూ వెళ్లాడు. 'ఈయనెవరో చేయితిరిగిన వైద్యుడై ఉండాలే' అనుకుంటున్నారా? ఆ డాక్టర్‌గారు మరెవరో కాదు... ఒక బుజ్జి గుర్రం.

## నడకలో నేస్తం...

అరవైయేళ్ల మూర్తిగారికి మధుమేహం ఉంది. ఉదయం, సాయంత్రం... రెండు పూటలా వాకింగ్ చేయమని వైద్యులు చెప్పారు. అయినా సరే పెద్దాయన గడపదాటడు. ఇంట్లో వాళ్లు చెప్పినా అస్సలు పట్టించుకోడు. దాంతో మూర్తిగారి మీద 'పెట్ థెరపీ' అస్త్రాన్ని ప్రయోగించాడు వాళ్ల పెద్దబ్బాయి. ఇంటికి ఒక స్పెషల్ థెరపిస్ట్‌ను తీసుకొచ్చారు. అంతే... ఆ థెరపిస్ట్‌తో కలిసి, ఇప్పుడు రోజుకు రెండుసార్లు హుషారుగా వాకింగ్‌కు వెళుతున్నారు. బద్ధకాన్ని వదిలించి, వాకింగ్‌లోని మజా ఏమిటో తెలియజెప్పిన ఆ థెరపిస్ట్... ఒక కుక్క! కల్లాకపటం తెలియని జంతువులతో గడిపేందుకు అందరూ ఇష్టపడతారు. మన నుంచి తిరిగి ఏమీ ఆశించని ఆ మూగజీవాల సమక్షంలో సమస్యలన్నీ మరిచిపోతాం. మనసు తేలికవుతుంది. మనసు ఆనందంగా ఉంటే, శరీరం సాంత్వన చెందుతుంది. ఏ చికిత్సకైనా సహకరిస్తుంది. ఇదే 'పెట్ థెరపీ' ఫార్ములా. దీన్నే 'యానిమల్ అసిస్టెడ్ థెరపీ' అనీ అంటారు.

పుణె, ముంబయి నగరాల్లో పెట్ థెరపీ సేవలను విజయవంతంగా అందిస్తోంది 'యానిమల్ ఏంజిల్స్ ఫౌండేషన్'. 'యానిమల్ ఫర్ హ్యూమన్ వెల్‌నెస్ ... ఈ సంస్థ నినాదం. ఈ విధానం నేరుగా రోగాలను నయం చేయకపోవచ్చు. కాని రోగంతో బాధపడుతున్నామన్న ఆలోచనను తక్షణం దూరం చేస్తుంది. అదే సగం విజయం! క్యాన్సర్, ఎయిడ్స్ వంటి ప్రాణాంతక రోగాలతో బాధపడుతున్న వారి పరిస్థితి దయనీయంగా ఉంటుంది. ప్రతిక్షణం నరకయాతనే! వారి దృష్టిని మళ్లించేందుకు 'పెట్ థెరపీ' చక్కని మార్గం. ఆ మూగజీవాలతో గడుపుతుంటే కాలమే తెలియదు, గాయమే గుర్తుండదు.

## గట్టి పోటీయే...

అలా అని ఆ పక్షులూ జంతువులూ ఏ అర్హతా లేకుండా థెరపిస్టు హోదా సంపాదించేయవు. పోటీ 'నీట్' స్థాయిలో ఉంటుంది. కొన్నాళ్ల శిక్షణ అనంతరం, మనుషులతో అవి మెలిగే విధానాన్ని గమనించి... దాదాపు ఐదు రకాల పరీక్షలు పెట్టిన తర్వాతే ఎంపిక చేస్తారు. కాకపోతే, అక్కడ 'సీటు గ్యారెంటీ' కోచింగ్ సెంటర్ల హడావుడి ఉండదంతే!





## గుర్రపు పిల్లలు

మానసిక ఎదుగుదల సరిగా లేని పిల్లల్లో, దీర్ఘకాలిక వ్యాధులతో బాధపడే రోగుల్లో... ఆత్మస్థైర్యం నింపేందుకు ఇవి ఉపయోగపడతాయి. ఎప్పుడూ హుషారుగా ఉంటూ... జీవితం పట్ల కొత్త మమకారాన్ని నింపుతాయి.



## పక్షులు

ముచ్చటైన ముక్కులూ, రంగురంగుల రెక్కలూ... ఆ పక్షుల్ని చూస్తున్నంతసేపూ మనల్ని మనం మరిచిపోతాం. క్యాన్సర్ రోగుల్లో, ఎయిడ్స్ వ్యాధిగ్రస్థుల్లో ఒత్తిడిని తగ్గించి, గుండె ధైర్యం పెంచేందుకు పక్షుల థెరపీని సిఫార్సు చేస్తున్నారు.



## పిల్లులు

'హైపర్ యాక్టివ్‌నెస్'ను తగ్గించేందుకు పిల్లుల్ని వాడుతుంటారు. ముద్దుగా ఉండే పిల్లులు, ఏ పని చేసినా ఎంతో శ్రద్ధగా చేస్తాయి. చిన్నపిల్లలు పిల్లులతో ఆడుకుంటూ, ఏకాగ్రతను పెంచుకుంటున్నారట. తోటివారితో ఎలా మెలగాలి, ఎదుటివాళ్లకు మనం నచ్చనప్పుడు, సందర్భానికి తగినట్టు మనల్ని మనం ఎలా మార్చుకోవాలనే విషయాన్ని పిల్లులు పరోక్షంగా నేర్పిస్తున్నాయి.



## ఎన్నో ప్రయోజనాలు...

మానసికంగా ఎదిగీ ఎదగని పిల్లలు, హైపర్ యాక్టివ్ బాలలు, బిడియస్థులు, వికలాంగులు, వృద్ధులకు పెట్ థెరపీని ప్రత్యామ్నాయ చికిత్సగా సిఫార్సు చేస్తున్నారు వైద్యులు. చాలా ఆరోగ్య సమస్యలకు మూలం అధిక రక్తపోటు. మానసిక ప్రశాంతతను కలుగజేసి, ఒత్తిడినీ రక్తపీడనాన్నీ అదుపు చేస్తుంది పెట్ థెరపీ. చిన్నపిల్లల్లో అత్యుత్సాహాన్ని తగ్గించి, ఆత్మ విశ్వాసాన్ని పెంచేందుకూ జంతుస్నేహం ఉపయోగపడుతుంది. కొందరు పిల్లలు చదువు పట్ల అంతగా ఆసక్తి చూపించరు. ఇంకొందరికి కొత్త విషయాలను నేర్చుకోవాలనే కుతూహలం అస్సలు ఉండదు. మరికొందరేమో తోటి పిల్లలతో మాట్లాడాలన్నా భయపడతారు. ఇలాంటి వారిలో 'పెట్ థెరపీ'తో మార్పు తీసుకురావచ్చని పరిశోధనలు నిరూపించాయి.

## శునకాలు

మనిషికి అత్యంత సన్నిహితంగా మెలిగే శునకాల్ని పెట్ థెరపీలో విరివిగా వాడుతుంటారు. చదువుపై శ్రద్ధ చూపించని పిల్లలకు ఒక శునకాన్ని తోడుగా ఇస్తే, వాటితో కలిసి ఆడుకుంటూ.... బోలెడు కథలు వినిపిస్తున్నారట. క్రమేణా చదువుల పట్ల ఆసక్తి పెరుగుతోందట. కుక్కలు కూడా పిల్లల మాటలను శ్రద్ధగా వింటాయి. ఆలోచనల్లో ఉద్వేగాల్లో మనిషికి ఎంతో కొంత దగ్గరగా ఉన్న జంతువు కూడా శునకమే. దీంతో మిగతా జంతువులతో పోలిస్తే శునకవైద్యుల హస్తవాసి కాస్త ఎక్కువే.



## కుందేళ్లు

చూపులేని విద్యార్థుల్లో మానసిక ధైర్యాన్ని పెంచేందుకు, వృద్ధుల్లో ఒంటరితనాన్ని దూరం చేసేందుకూ కుందేళ్లు ఉపయోగపడుతున్నాయి. అరచేతుల్లో ఒదిగిపోయి, నిమిషాల్లో నిరుత్సాహాన్ని పోగొడతాయి. ఆ నిర్మలత్వం మనసులోని చికాకుల్ని మరిపించేస్తుంది.





# ఇక్కడ జాబొస్తే... దొరబాబే!



కొలువుల కోతలు జరుగుతున్నా... తొలగింపు భయాలు ఊపందుకుంటున్నా - ప్రత్యేకించి కొన్ని కంపెనీల్లో పని చేయడానికి యువ గ్రాడ్యుయేట్లు చాలా ఆసక్తి చూపుతున్నారు. తాజాగా... నవతరం ఇష్టపడే టాప్- 10 కంపెనీల చిట్టాను తయారు చేసింది లింకెడిన్. పనిలో స్వేచ్ఛ, ఎదిగే అవకాశం, చక్కని జీతభత్యాలు, స్వతంత్ర బాధ్యతలు .. ఇవీ జూనియర్ బాబుల్ని ఆకర్షిస్తున్న అంశాలు.




### ఫ్లిప్‌కార్ట్

ఉద్యోగులకు ఆర్థిక, మానసిక సంతృప్తిని కలిగించడంలో దేశంలో మొదటి స్థానంలో ఉందీ ఈకామర్స్ సంస్థ. సిబ్బందికి పూర్తి పని స్వేచ్ఛ ఉంటుంది. రెండేళ్ల పూర్తి అయ్యాక, పిల్లల పెంపకం కోసమో పెద్దచదువుల కోసమో బ్రేక్ తీసుకోవచ్చు.

### అమెజాన్

ఈ అంతర్జాతీయ దిగ్గజం నవతరానికి కెరీర్ పాఠశాల. నేర్చుకోడానికి బోలెడంత అవకాశం ఉంటుంది. వృత్తిపరమైన సమస్యల్ని ఎలా అధిగమించాలి, తోటి ఉద్యోగులతో ఎలా మెలగాలి? అన్న విషయంలోనూ శిక్షణ ఇస్తారు.







### కేపీఎంజీ

ఆడిట్, కన్సల్టింగ్ సేవలు అందించే అంతర్జాతీయ సంస్థ ఇది. '10,000 స్టోరీస్ ఛాలెంజ్' పేరుతో, ఉద్యోగులు వృత్తిపరంగా తాము సాధించిన విజయాల్ని పోస్టర్ల రూపంలో ప్రదర్శించే అవకాశం ఇస్తోంది. మహిళా సిబ్బందిని మరింత ప్రోత్సహిస్తుంది.

### వన్97 కమ్యూనికేషన్స్

పేటీఎం- కరెన్సీ రద్దు తర్వాత ప్రతి మొబైల్‌లో కనిపిస్తున్న యాప్. పేటీఎమ్ యాప్‌ను రూపొందించింది వన్97 కమ్యూనికేషన్స్ సంస్థే. పని ఒత్తిడి ఎక్కువే అయినా, ఆ ఒత్తిడిని ఎదుర్కొనేందుకు అనేక తాయిలాల్ని అందిస్తోంది.







### ఓలా

ఆన్‌లైన్ క్యాబ్ బుకింగ్ సంస్థ. కొత్త ఆలోచనలకు నో చెప్పదు. టెక్నాలజీని ప్రేమించేవారూ, అద్భుతాలు చేయాలని కలలుగనేవారూ... ఈ ఆవరణలో కాలు పెట్టాలని ఉవ్విళ్లూరుతుంటారు. ఆవరణలో తరచూ వినిపించే మాట 'వాట్ నెక్ట్స్'.

### హెచ్‌సీఎల్ టెక్నాలజీస్

దేశీయ ఐటీ దిగ్గజమిది. అమెరికా, చైనా, జపాన్ వంటి 311 దేశాల్లో విస్తరించిన ఈ కంపెనీ బ్రాండ్ విలువ కుర్రకారును ఆకర్షిస్తోంది. అంతర్జాతీయ ప్రాజెక్టుల్లో పని చేసే అవకాశాలు ఏ నిమిషం అయినా తలుపుతట్టవచ్చు.







### అడోబ్

'ఫోటోషాప్'తో పాటు వివిధ సాఫ్ట్‌వేర్ ప్రోగ్రామ్స్ తయారు చేస్తున్న కంపెనీ ఇది. ఆఫీసు ఆవరణలు అంతర్జాతీయ శ్రేణిలో ఉంటాయి. సిబ్బంది నైపుణ్యాన్ని పెంచడానికి ఎంతైనా ఖర్చు చేస్తారు. ఒకసారి కొలువులో చేరిన తర్వాత, తొంభైశాతం మంది బయటికి రావడానికి ఇష్టపడరు.

### ఆల్ఫాబెట్

సెర్చ్ ఇంజన్ గూగుల్ దీని మాతృసంస్థ. సృజనాత్మక జీవులకే ఇక్కడ పెద్దపీట. మంచి జీతమూ అంతకు మించిన సౌకర్యాలూ ఉంటాయి. ప్రోత్సాహకాలూ బోలెడు. అన్నిటికీ మించి... ప్రపంచానికి పనికొచ్చే పని చేస్తున్నామన్న సంతృప్తి ఉంటుంది.







### ఓయో రూమ్స్

హోటళ్లలో రూములను రిజర్వ్ చేసే ఆన్‌లైన్ ఆతిథ్య సంస్థ. కష్టపడి కాకుండా... ఇష్టంగా, స్మార్ట్‌గా పనిచేయడాన్ని ప్రోత్సహిస్తారు. అంతా పాతికేళ్లలోపు కుర్రాళ్లే. పని పనిలా అనిపించదు. బాసిజం వేధించదు.

### క్యాప్‌జెమినీ

దాదాపు 110 దేశాల్లో విస్తరించిన క్యాప్‌జెమినీలో 2లక్షల మంది పనిచేస్తున్నారు. ఇక్కడ టీంవర్క్‌కే పెద్దపీట. పనివేళల్లో వెసులుబాటు ఉంటుంది. సిబ్బంది ఎంత సంతోషంగా ఉన్నారో తెలుసుకోడానికి 'హ్యాపీనెస్ ఇండెక్స్' తరహా కొలమానాన్ని సిద్ధం చేసుకుంది.




హెచ్‌ఆర్ సూక్తి : **నేర్చుకోడానికి చిన్న కంపెనీలో చేరాలి. స్థిరపడటానికి పెద్ద కంపెనీలో ఉద్యోగం సంపాదించాలి.**

# పీసీఓడీ తగ్గదని ఎవరన్నారు?

కొంతమంది స్త్రీలలో హార్మోన్ల అసమతుల్యత వల్ల నెలసరి సక్రమంగా రాకపోవడం, రుతుస్రావంలో లోపాలు, అధిక రక్తస్రావం లేక తక్కువ రక్తస్రావం కావడం, బరువు అధికంగా పెరగడం, అవాంఛిత రోమాలు రావడం జరుగుతుంది. దీనికి ప్రధాన కారణం అండా శయంలో నీటి బుడగలు ఏర్పడటం. దీన్ని పాలిసిస్టిక్ ఒవేరియన్ డిసీజ్(పీసీఓడి)అని అంటారు. మన వ్యావహారిక భాషలో అండాశయంలో నీటి బుడగలు లేదా అండాశయంలో తిత్తులు అంటారు. మహిళల్లో వచ్చే హార్మోన్ సమస్యలలో ఇది ప్రధాన సమస్య.

**ఎవరికి వస్తుంది? :** ఆడవారిలో 12 నుంచి 14 సంవత్సరాల వయసులో ఈ సమస్య వస్తుంది. 5-10శాతం మహిళల్లో యుక్త వయసులో కూడా ఈ సమస్యను చూస్తాం. ఇది వంశపారంపర్యంగా వచ్చే అవకాశం కూడా ఉంది. అధిక బరువు ఉండటం ఈ సమస్యను మరింత జఠిలం చేస్తుంది. పీసీఓడీ సమస్యలో ఆండ్రోజన్స్ అధికంగా ఉత్పత్తి అవడం వలన హార్మోన్స్ సమతుల్యత లోపించి లక్షణాలు రావడం జరుగుతుంది. దీనికి తోడు ఇన్సులిన్ రెసిస్టెంట్, ప్రొలాక్టిన్ హార్మోన్స్ తేడా వలన సమస్య మరింత జటిలమవుతుంది.

**చికిత్స :** పీసీఓడీ సమస్యను త్వరగా గుర్తించి వైద్యం తీసుకోవడం చాలా ముఖ్యం. పీసీఓడీ సమస్యకు హోమియోలో చికిత్స ఉంది. హార్మోన్ల సమతుల్యతను సాధించడం ద్వారా పీసీఓడి సమస్యను చక్కదిద్దవచ్చు. అనుభవజ్ఞులైన హోమియో వైద్యుల దగ్గర చికిత్స తీసుకుంటే పీసీఓడీ నుంచి విముక్తి లభిస్తుంది.

# హెచ్ఐవి, హెర్పిస్‌లను అణచడం సాధ్యమే

ఈ వ్యాధి పేరు చెబితేనే ప్రతీ ఒక్కరూ భయపడిపోతారు. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, చిన్న చిన్న వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

**హెర్పిస్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స :** హోమియో మందులతో రోగనిరోధక శక్తి బలపడుతుంది. తద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు కూడా హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగిస్తుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



# సైనసైటిస్ తగ్గదని ఎవరన్నారు?

ముక్కు, కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

## గుర్తించటం సులభం

తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

## సర్జరీ అవసరం లేదు

హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందులు వాడిన చాలా మందికి సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్ తొలగిపోయింది. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్స వల్ల సైనసైటిస్ సమస్య సమూలంగా తొలగిపోతుంది. మళ్లీ మళ్లీ బాధించడం జరగదు.

# హెపటైటిస్ ఇలా తగ్గింది

ఒకరోజు సుమారు 45 సంవత్సరాల వయస్సున్న ఒక వ్యక్తి మా క్లినిక్‌కు వచ్చాడు. అతన్ని చూడగానే తీవ్రమైన జబ్బుతో బాధపడుతున్నాడని అర్థమైంది. విషయం ఏంటని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు. "ఆరు నెలల క్రితం కడుపు నొప్పి మొదలయింది. పరీక్ష చేయిస్తే కామెర్లన్నారు. మందులు వాడాను. కానీ ఫలితం లేదు. ఆకలి బాగా తగ్గిపోయింది. వాంతి వస్తున్నట్లుగా ఉంటుంది. ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా వస్తోంది. పొట్ట కూడా ఉబ్బుగా ఉంటోంది. కాళ్లు వాస్తున్నాయి" అని తన బాధనంత వివరించాడు. ఆల్కహాల్ తాగే అలవాటు ఉందా? అంటే ఉందని అన్నాడు. గత రిపోర్టులను చూస్తే జాండిస్ అని తెలుస్తున్నా హెపటైటిస్ ఉందేమో ఒకసారి కన్‌ఫార్మ్ చేసుకోవడం మంచిదని చెప్పా. ఈ పరీక్షలన్నీ చేయించి రిపోర్టులతో మళ్లీ వచ్చి కలువు అని చెప్పా. సాయంత్రం రిపోర్టులతో వచ్చాడు. నేను ఊహించినట్టుగానే హెపటైటిస్ ఉన్నట్లుగా తేలింది. అదే విషయాన్ని ఆయనకు చెప్పా. భయపడాల్సిన అవసరం లేదని మంచి మందులున్నాయని ధైర్యం చెప్పి క్రమం తప్పకుండా సూచించిన మందులు వాడమన్నా.

## చికిత్స తరువాత

హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియో విధానంలో అందుబాటులో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. ఇతర కాలేయ సమస్యలకు హోమియో మందులు బాగా పనిచేస్తాయి. చికిత్స మొదలు పెట్టిన నెల రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. మూడు నెలల తరువాత ఆకలి బాగా పెరిగిందని చెప్పుకొచ్చాడు. హోమియో వైద్యం నాకు పునర్జన్మను ప్రసాదించిందని కృతజ్ఞతలు చెప్పుకొచ్చాడు.

# వేయి పడగలు

యాళ్ల అచ్యుతరామయ్య

**పెళ్లయి పట్టుమని పది రోజులు కూడా కాలేదు. కాళ్ల పారాణింకా ఆరనే లేదు. సినిమా హాల్లోంచి కొత్త పెళ్లికూతురు అత్యంత నాటకీయంగా మాయమైపోయింది. కొద్ది నిమిషాల ముందు వరకూ ఆమె ప్రక్కనే కూర్చుని సినిమా చూసిన భర్త ఫణికి మైండ్ బ్లాంక్ అయిపోయింది. సినిమాల్లో కంటే నిజజీవితంలో మలుపులు ఎక్కువగా ఉంటాయన్న సత్యం అతనికి ఆలస్యంగా బోధపడింది.**



ఫణి కొద్దిగా తేరుకున్నాక, అసలేమైందా అని ఆలోచించాడు. ఇటీవల తన జీవితంలో జరిగిన సంఘటనలను నెమరు వేసుకున్నాడు.

ఫణి ఓ కార్పొరేట్ బ్యాంకులో ప్రొబేషనరీ ఆఫీసరుగా హైదరాబాదులో పని చేస్తున్నాడు. అతని చదువు సంధ్యలన్నీ కాకినాడలోనే. ఉద్యోగరీత్యా హైదరాబాద్ వచ్చి మూడేళ్లయింది. ప్రేమా, దోమా లాంటి మాటలతనికి సరిపడవు. చాలా ప్రాక్టికల్ మనిషి. తల్లిదండ్రులకంటే పిల్లల బాగు కోరుకునేదెవరని వాళ్లు కుదిర్చిన సంబంధాన్నే ఓకే చేశాడు.

అమ్మాయిది సామర్లకోట. పేరు ఐశ్వర్య. సార్థకనామధేయురాలే అనవచ్చు. ఎందుకంటే వాళ్ల ఆర్థిక స్థితిగతులని బట్టి మధ్యతరగతికి ఎక్కువ, ఆ పై తరగతికి తక్కువ అన్నట్లుగా ఉంటుంది. ఎలాగోలా డిగ్రీ పూర్తయిందనిపించింది. పీజీ చేయడమంత ఈజీ కాదని ఓ నిర్ణయానికొచ్చేసి, ఏవో పోటీ పరీక్షలకు తయారవుతూ ఉంది.

ఫణి దృష్టిలో పెళ్లిచూపులనేవి ఓ ఫార్మాలిటీ మాత్రమే! ముందుగా ఫణి తల్లిదండ్రులు అమ్మాయిని చూశారు. వాళ్లకి అమ్మాయి అన్నివిధాలా నచ్చిందని చెప్పగానే ఫణిక్కూడా ఆటోమేటిగ్గా ఐశ్వర్య మీద ఇష్టం కలిగిపోయింది, ఆమెనింకా అతను చూడకపోయినా!

బ్యాంకు ఉద్యోగి కాబట్టి, ఫణికి పెళ్లి కోసమని వారం రోజుల సెలవు దొరకడమే గగనమైపోయింది.

పెళ్లయిన నాలుగోరోజునే కొత్త దంపతులతో బాటు ఫణి తల్లిదండ్రులు హైదరాబాద్ బయల్దేరి వచ్చేశారు.

ప్రారంభంనుండీ ఐశ్వర్య ముభావంగానే ఉంటూ ఉంది. 'మొదటిసారిగా అమ్మానాన్నలను వదిలిపెట్టి రావడంవల్ల, ఆడపిల్లకి ఆ మాత్రం బెంగ సహజమే కదా!' అని అనుకున్నాడు ఫణి.

పెళ్లయిన ఎనిమిదో రోజున మొదటిసారిగా నోరు తెరిచి "సిన్మాకి వెడదామండీ" అని ఐశ్వర్య అడిగేసరికి, ఫణికి పగలే వెన్నెలలా, జగమే ఊయలలా అనిపించి, వెంటనే ఆన్ లైన్లో 'కల్యాణ వైభోగమే' ఫస్ట్ షోకి టికెట్లు బుక్ చేశాడు.

సినిమా పేరు 'కల్యాణ వైభోగమే!' కానీ, అందులో కల్యాణమూ లేదు, వైభోగమూ లేదు! హీరో, హీరోయినూ పెళ్లికి ముందే విడాకులకు ప్లాన్ చేసుకుంటూ ఉంటారు. శుభమా అని పెళ్లి చేసుకున్న కొత్త దంపతులు చూడదగ్గ సినిమా కాదేమోనని ఫణికి అనిపించింది.

కళ్లు తెరుచుకుని చూస్తున్నా, తెర మీద బొమ్మలేవీ ఫణి మైండ్‌లో రిజిస్టర్ కావడం లేదు. ఆమె నుండి వస్తున్న పెర్‌ఫ్యూమ్ అతన్ని వేరే లోకాలకి తీసుకుని పోయింది.

ఇంటర్వెల్ వరకూ కదలకుండా కూర్చున్న ఐశ్వర్య సినిమా తిరిగి ప్రారంభమయిన పదినిమిషాల తర్వాత వాష్ రూమ్‌కని చెప్పి బయటికి వెళ్లింది. పావుగంట ... అరగంట ... గంట ... గడిచిపోయినా ఆమె వెనక్కి రాకపోవడంతో ఫణికి అనుమానం మొదలైంది.

ఫణి, థియేటర్ లోంచి లాంజ్ లోకి వచ్చి ఐశ్వర్య మొబైల్‌కి కాల్ చేశాడు. స్విచ్ ఆఫ్ అన్న స్వరం వికారంగా వినిపించింది. లేడీస్ టాయిలెట్ దగ్గర తచ్చాడాడు. శుభ్రం చేసేవాడు కూడా కనిపించలేదు.

వెంటనే థియేటర్ మేనేజర్ని కలిసి జరిగినదంతా చెప్పేడు. మేనేజరు వెంటనే ఒక లేడీ వర్కర్‌ను పిలిచి లేడీస్ టాయిలెట్లన్నిటినీ వెదకమన్నాడు. ఆమె ఓ పది నిమిషాల్లో తిరిగొచ్చి ఎవరూ లేరన్న చావు కబురు చల్లగా చెప్పింది.

ఫణి గుండెలు గుభేల్మన్నాయి. థియేటరు గుమాస్తాతో కలిసి బయటికి వస్తూ సెక్యూరిటీ గార్డును ఎంక్వైరీ చేసేడు. గులాబీ రంగు డ్రెస్సూ, పొడుగ్గా వేలాడుతున్న జుట్టుతో ఓ అమ్మాయి ఇంటర్వెల్ తర్వాత బయటికి వచ్చి, రోడ్డు పక్కనే బైక్ పై వెయిట్ చేస్తున్న అబ్బాయి వెనుక కూర్చుని వెళ్లిపోయిందని

## ఈ వారం కథ

చెప్పాడు.

కచ్చితంగా ఆమె తన భార్యేనని నిర్ధారణ అయిపోవడంతో, దింపుడుకళ్లం ఆశతో "ఆ బైక్ నెంబరును గమనించావా?" అని ఫణి అడిగేడు. "లేదు సార్!" అంటూ సెక్యూరిటీ గార్డు ఇబ్బందిగా మొహం పెట్టాడు.

ఫణికి ముచ్చెమటలు పోసి, గొంతు తడారిపోయింది. సినిమా హాలు మెట్లమీదనే కూర్చుండిపోయాడు. సెక్యూరిటీ గార్డు అందించిన బాటిల్లోంచి నీళ్లు తాగాక, కొంతసేపటికి తేరుకున్నాడు.

పెళ్లిచూపుల్లో తను అశ్రద్ధ చేసిన ఓ చిన్న సంఘటనకీ, ఇపుడు జరిగిన ఈ పెద్ద సంఘటనకీ ఏదో లంకె కుదిరినట్లనిపించింది.

పెళ్లిచూపులనాడు ఐశ్వర్య ముందుగా మంచినీళ్ల గ్లాసుతో వచ్చింది. ఫణికి అందించిన గ్లాసు కింద ఉంచిన పేపరు మడతవైపు సైగ చేస్తూ చూపించింది.

ఫణి ఆ కాగితాన్ని రహస్యంగా చేతిలోకి తీసుకుని, ఏదో ఫోన్ వచ్చినట్లుగా నటిస్తూ బయటికి నడిచేడు. ఆ కాగితంలో "నాకు పెద్దలు కుదిర్చిన పెళ్లిళ్లపై గౌరవమూ లేదూ, నమ్మకం అంతకంటే లేదూ. ఎప్పటికైనా లవ్ మ్యారేజీయే చేసుకోవాలనుకుంటున్నాను. ఎంత చెప్పినా వినకుండా మా నాన్న ఈ పెళ్లిచూపుల్ని ఏరేంజి చేశాడు. మీకు నేను నచ్చలేదని చెప్పేయండి" అని రాసి ఉంది.

ఫణి అదే కాగితాన్ని వెనక్కి తిప్పి, "మీకంటే నేను వయసులో నాలుగేళ్లు పెద్దవాణ్ణి కాబట్టి చెబుతున్నా. ఇలాంటి ఫ్యాన్సీ ఐడియాలతో లైఫ్‌ని స్పాయిల్ చేసుకోకండి. ఇద్దరివైపు పెద్దలూ ఎన్నో ఆలోచించి మన మంచి కోసమే ఈ సంబంధాన్ని ఖాయం చేయాలనుకుంటున్నారు. ఆ తర్వాత మీ ఇష్టం" అని రాసి, ఖాళీ గ్లాసు తీసుకెళ్లడానికి వచ్చిన ఐశ్వర్యకి అందచేశాడు.

ఇప్పుడు జరిగింది తలుచుకుంటే ఫణికి తెలిసి వచ్చింది, తనదే ఫ్యాన్సీ ఐడియా అని.

ముందుగా పెద్దవాళ్లనెందుకు కంగారు పెట్టడమని, తన క్లోజ్ ఫ్రెండు నాగేశ్వర్‌కి ఫోన్ చేసి విషయాన్ని టూకీగా చెప్పి "నువ్వు వెంటనే వస్తే, ఇద్దరం కలిసి వెళ్లి పోలీసు స్టేషన్లో కంప్లయింట్ ఇద్దాం" అన్నాడు.

నాగేశ్వర్ "అలాంటి పిచ్చిపని చేయకు. ఇలాంటి సందర్భాలలో మొదటి అనుమానం భర్త, అత్తమామల మీదనే వస్తుంది. అందుకని ముందుగా వాళ్లనే అరెస్ట్ చేస్తారు. నేనిప్పుడే బయల్దేరుతున్నా, నువ్వక్కడే ఉండు" అన్నాడు.

ఫణి మధ్యమధ్యలో భార్య మొబైల్‌కి డయల్ చేస్తూనే ఉన్నాడు. సమాధానంలో మాత్రం మార్పు లేదు.

కొద్దిసేపటికే నాగేశ్వర్ అక్కడికి చేరుకున్నాడు. "ఫణీ, ఈ సమయంలో అడగకూడని ప్రశ్నే కానీ ఈ కొద్ది రోజుల్లో మీ ఇద్దరి మధ్యా రిలేషన్ ఎలా ఉంది?" అన్నాడు.

ఫణి కొద్దిగా ఇబ్బంది పడుతూనే, "నేను తనకి దగ్గరవ్వాలనుకున్నప్పుడల్లా 'నేనింకా అందుకు మానసికంగా సిద్ధంగా లేను' అనేది. తల్లిదండ్రులమీద బెంగేమో అనుకున్నా" అన్నాడు.

నాగేశ్వర్‌కి విషయమంతా బోధ పడినట్లయింది. "ఆమె మొదటి నుండీ ఓ ప్లాన్ ప్రకారం నిన్ను ఎవాయిడ్ చేసి, తన బాయ్ ఫ్రెండును పిలిపించుకుని, ఎస్కేప్ అయిపోయింది" అన్నాడు.

ఫణి ముఖం నల్లబడింది. "ఈ డిస్కషన్స్ ఆపి ప్రస్తుతం ఏం చెయ్యాలో చెప్పరా!" అన్నాడు.

"ముందుగా మీ మావ గారికి ఫోన్ చేసి, జరిిందంతా చెబుదాం" అన్నాడు నాగేశ్వర్.

ఫణి తన మావగారు భుజంగరావుగారి ఫోన్‌కి డయల్ చేసి, స్పీకర్ ఆన్ చేశాడు. జరిగిన సంగతంతా వీలైనంత క్లుప్తంగా చెప్పాడు.

వెంటనే ఆయన, "అయ్యో ... అలానా! ఎక్కడో ఏదో పొరపాటు జరిగి ఉంటుంది.

> పెళ్లిచూపుల్లో తను అశ్రద్ధ చేసిన ఓ చిన్న సంఘటనకీ, ఇపుడు జరిగిన ఈ పెద్ద సంఘటనకీ ఏదో లంకె కుదిరినట్లనిపించింది. పెళ్లిచూపులనాడు ఐశ్వర్య ముందుగా మంచినీళ్ల గ్లాసుతో వచ్చింది. ఫణికి అందించిన గ్లాసు క్రింద ఉంచిన పేపరు మడతవైపు సైగ చేస్తూ చూపించింది. ఫణి ఆ కాగితాన్ని రహస్యంగా చేతిలోకి తీసుకుని, ఏదో ఫోన్ వచ్చినట్లుగా నటిస్తూ బయటికి నడిచేడు. ఆ కాగితంలో...

మీరు తొందరపడి పోలీసు కంప్లయింటు ఇవ్వకండి. మాకు తెలిసినవాళ్లందరికీ ఫోన్ చేసి కనుక్కుని ఏ సంగతీ చెబుతాను" అన్నాడు.

నాగేశ్వర్‌కి ఏదో క్లూ దొరికినట్లయింది. "ఇంత జరిగినా ఆ పెద్దమనిషి నిమ్మకు నీరెత్తినట్టు ఉన్నాడంటే ఇలా జరగొచ్చు అని అతను ముందే ఊహించినట్లు లేదూ" అన్నాడు.

• • •

రోజులు గడిచేకొద్దీ ఆ నోటా, ఈ నోటా ఫణికి అసలు విషయం తెలిసింది. ఐశ్వర్య డిగ్రీ చదువుతున్నపుడే శేషు అనే అబ్బాయితో పరిచయమై, ప్రేమగా మారి, పెళ్లి చేసుకుంటాను అనేంతవరకూ వచ్చింది. ఆ అబ్బాయి మంచి అందగాడే కానీ ఆస్తి లేని కారణాన తనకి అల్లుడయ్యే యోగ్యత లేదని భుజంగరావు పెళ్లికి అడ్డుపడ్డాడు. కాదూ, కూడదంటే కూతుర్ని చంపేసి తానూ చస్తానని బెదిరించాడు. ఐశ్వర్య తమ్ముడు నాగేంద్ర కూడా తండ్రికి ఒత్తాసు పలికాడు.

ఆ తాటాకు చప్పుళ్లకేమీ భయపడకుండా, ఐశ్వర్య తాను శేషునే పెళ్లి చేసుకుంటానని తెగేసి చెప్పింది. బలవంతంగా తండ్రి తనకి పెళ్లిసంబంధాలను వెతుకుతున్నాడని శేషుకి చెపుతూనే ఉంది. 'నా గొంతులో ప్రాణం ఉండగా, వేరెవరినైనా నీ మెళ్లో తాళి కట్టనిస్తానా!' అని అతను అంటూనే ఉన్నాడు. ఈ లోపు ఫణితో ఆమె పెళ్లి అయిపోయింది.

ఫణి తన ఒంటి మీద చేయి వేయకుండా ఐశ్వర్య ఎనిమిదిరోజులపాటు తప్పించుకోగలిగింది. ఇక ఆ రోజున శేషుని సినిమా హాల్ దగ్గరకు రప్పించి, అతనితో వెళ్లిపోయింది.

• • •

శేషు తన ఊరు చంద్రపాలెంకు ఐశ్వర్యని తీసుకొని వచ్చి, సొంత ఇంటిలోనే కాపురం పెట్టాడు. వాళ్లది వ్యవసాయ కుటుంబం. తండ్రి చనిపోయి చాలా సంవత్సరాలయింది. అతని తల్లి బూరెమ్మ ఓ పాలేరు కుర్రాడి సాయంతో నర్సరీ నడుపుకుంటూ రోజులు వెళ్లదీస్తోంది. ఒక్కగానొక్క కొడుకు చదువు పాడవకూడదని; అతనికి ఇంటిపని కానీ, నర్సరీ పని కానీ చెప్పడం మానేసింది.

పెళ్లయినామెను తీసుకువచ్చి కొడుకు కాపురం పెట్టడం నచ్చకపోయినా, కొడుకును ఎదిరించే ధైర్యం లేక బూరెమ్మ మౌనంగానే ఉండిపోయింది.

ఐశ్వర్య ఒంటరిగా ఉన్నప్పుడు చూసి, బూరెమ్మ "నా కొడుకైనా నిజమే చెప్పాలి. వీడు నీకు తగినోడు కాదమ్మా .. మోసపోయావు తల్లీ" అని అన్నప్పుడు, ఐశ్వర్యకు ఆమె తల్లిలానే అనిపించింది. కొద్దిరోజుల్లోనే ప్రేమ తిండిపెట్టదన్న చేదునిజం ఐశ్వర్యకు తెలిసివచ్చింది. వారాలు గడిచేకొద్దీ ఆమె ఒంటిమీద నగలు ఒక్కొక్కటిగా మాయమైపోయాయి. చిట్టచివరికి శేషుకూడా ఆమె జీవితం నుండి మాయమైపోయాడు.

తన పుట్టింటికి పోయి, తండ్రి కాళ్లమీద పడాలన్న ఆలోచన వచ్చినపుడు, ఐశ్వర్య ఒళ్లంతా తేళ్లూ, జెర్రులూ పాకినట్లనిపించింది. ఎంత కష్టమైనా సరే ఆత్మగౌరవంతో తన జీవితాన్ని అక్కడే కొనసాగించాలనుకుంది.

ఆలస్యంగానైనా ఆమెకు లోకంపోకడ అర్థమైంది. రాటు దేలితేనే కానీ బతకలేనని అర్థమైంది. ఒంటరిగానైనా ధైర్యంగా బతుకుతున్న అత్త బూరెమ్మను చూస్తే ఆమెకు మరింత ధైర్యం కలిగింది. అత్తగారిలో అమ్మను చూసుకుంది. ఒకర్ని చూసి ఒకరు ధైర్యం తెచ్చుకొన్నారు. నర్సరీలో పచ్చని మొక్కలమధ్య తిరుగుతూ ఉంటే, ఐశ్వర్యకు జీవితం మళ్లీ చిగురించినట్లుగా అనిపించింది.

• • •

శేషు, ఐశ్వర్యని వదిలేసి పారిపోయాడని తెలిసినపుడు ఫణికి కడుపు మంట చల్లారింది. 'భర్తని మోసం చేసిన భార్యకి మంచి శాస్తి



జరిగింది. దేవుడున్నాడు సుమా! ఇలాంటి ఆకర్షణలకి లొంగొద్దనీ, పెద్దలు కుదిర్చిన సంబంధాలే పది కాలాలపాటు పచ్చగా నిలుస్తాయనీ, చిలక్కి చెప్పినట్లు చెబితే ఐశ్వర్య వింటేగా! కానీ ... ఏ పాపమూ తెలియని తనకు జీవితాన్ని లేకుండానే చేసింది కదా! ఆమె ఒంటిపైన చిటికెన వేలు వేయకపోయినా, తనిప్పుడు సెకెండ్ హాండ్ హజ్బెండ్ అయిపోయాడు కదా! వాస్తవాలను ఎవరు పట్టించుకుంటారూ! మొదటి భార్య ఎందుకు వదిలిపెట్టేసి వెళ్లిపోయిందోనన్న అనుమానంతో తనకి మరో అమ్మాయినిచ్చి పెళ్లి చేయడానికి ఎవరు ముందుకు వస్తారూ?' -

ఇలా ఫణి మనసులో రకరకాల ఆలోచనలు చెలరేగాయి.

కాకినాడకూ, చంద్రపాలెంకూ మధ్య పెద్ద దూరం లేదు కాబట్టి, కాకినాడలోని తమ బంధువుల ద్వారా ఫణి కుటుంబానికి ఐశ్వర్య సంగతులన్నీ ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉన్నాయి.

నాగేశ్వర్ సలహాపై ముందుగా భార్యకు విడాకులు ఇవ్వాలని ఫణి నిర్ణయించుకున్నాడు. అఫీషియల్‌గా డివోర్సు మంజూరు అయిన తరువాతనే రెండో పెళ్లి ఆలోచన చేయాలనుకున్నాడు.

ఫణిని ఒక ఆలోచన మాత్రం ఎప్పుడూ వెంటాడుతూ ఉంది. ఉట్టి పుణ్యాన ఐశ్వర్య తనని మోసం చేసింది. వేరే అతన్ని ప్రేమించి, ఏమీ ఎరగనట్లు పెళ్లి చూపులకి ఎందుకు ఒప్పుకుంది? లవ్ మారేజీ చేసుకోవాలనుకుంటున్నానని రాసినామె, అప్పటికే ఒక అబ్బాయితో ప్రేమలో ఉన్న సంగతి ఆ చీటీలో ఎందుకు రాయలేదు? ఆమె ఉంటున్న ఊరికి వెళ్లి, ఆ ఒక్క ముక్కా ఆమె ముఖాన అడిగేసి, విడాకుల నోటీసు త్వరలోనే పంపబోతున్నానని చెప్పి వస్తేనే తనకి మనశ్శాంతిగా ఉంటుందనిపించింది. దీనికి నాగేశ్వర్ ఒప్పుకోకపోవచ్చనే అనుమానంతో, ఫణి ఒంటరిగానే ఐశ్వర్యని కలవాలనుకున్నాడు. అదే సమయంలో ఫకురుద్దీన్ పాలెంలో ఉండే తన చిన్ననాటి స్నేహితుడి పెళ్లి శుభలేఖ అందింది. ఫకురుద్దీన్ పాలెం పక్కనే చంద్రపాలెం కాబట్టి, వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది.

ఫణి తన ఫ్రెండు పెళ్లికి ఒకరోజు ముందే ఫకురుద్దీన్ పాలెం వెళ్లాడు. ఫ్రెండు తమ్ముడిని వెంటపెట్టుకుని ఫణి చంద్రపాలెం చేరుకున్నాడు. ఊరు చిన్నది కావడంతో నర్సరీ బూరెమ్మ ఇంటిని కనిపెట్టడం కష్టమేమీ అనిపించలేదు.

చిన్న పెంకుటిల్లే అయినా, ఇంటిచుట్టూ పూలమొక్కలు ఏపుగా పెరిగి ఉండడంతో, ఆ ప్రాంతమంతా ఎంతో ఆహ్లాదంగా ఉంది. ఆ పూలమొక్కల మధ్య వనదేవతలా తిరుగుతున్న ఐశ్వర్యను చూడగానే ఫణి గుండెలో గుబులు రేగింది. ఎండలో మొక్కలకు నీరు పడుతూ ఉండటం వలన ఆమె నుదిటిపైన చెమటబిందువులు మెరుస్తున్నాయి. ఆమె నిలిచి, నిదానంగా ప్రవహిస్తున్న నదిలా ఉంది. ఆమె ముఖంలోని ప్రశాంతతను చూసి ఫణి ఖంగుతిన్నాడు. తన పెళ్లి, పెటాకులై పోయిందన్న బెంగ కానీ, ప్రియుడు దగా చేసి పారిపోయేడన్న బాధ కానీ ఆమెలో ఏ కోశానా కనిపించడంలేదేమిటా అని అతను ఆశ్చర్యపోయాడు.

ఫణి తన స్నేహితుడి తమ్ముడిని రామకోవెల దగ్గరే ఉండమని చెప్పి పంపేశాడు. నెమ్మదిగా ఆ ఇంటి ఆవరణలో ప్రవేశించాడు. ఆ సమయానికి బూరెమ్మ ఇంటి దగ్గర లేకపోవడంతో, అతనికి మరింత ధైర్యం కలిగింది.

హఠాత్తుగా ఫణి అక్కడ ప్రత్యక్షమయ్యేసరికి ఐశ్వర్యకి ఆశ్చర్యం, అయోమయం. అదీ ఇదీ అని తేల్చి చెప్పలేని ఓ ఇబ్బందికరమైన మానసిక పరిస్థితి ఎదురైంది.

వెంటనే తేరుకుని, "మీరా ..! ఎలా ఉన్నారు? కూర్చోండి" అంటూ వరండాలో ఉన్న కుర్చీని చూపించింది.

ఫణి నిదానంగా కుర్చీలో కూర్చున్నాడు. ఉపోద్ఘాతం ఏమీ లేకుండానే "ఓ విషయం క్లియర్‌గా చెప్పు. అంత తెగింపు ఉన్నదానివి, అసలు పెళ్లిచూపులకు ఎందుకు ఒప్పుకున్నావ్? నాలాంటివాడి జీవితాన్ని నాశనం చేసే బదులు, ఆ లేచిపోయేదేదో పెళ్లిచూపులకి ముందే పోయి ఉండాల్సింది. నాలాంటి అమాయకుడ్ని ఎందుకీ రొంపిలోకి లాగేవు?" అన్నాడు ఆక్రోశంగా.

ఐశ్వర్య విస్మయంగా అతని వైపు చూసి, "ఫణిగారూ .. 'లేచిపోవడం' లాంటి మాటలే మీ సంస్కారానికి అద్దం పడుతున్నాయి" అని కొద్దిసేపు ఆలోచించి, "ఈ సంఘటన మొత్తంలో నన్నొక్కదాన్నే తప్పు పడుతున్న నువ్వు అమాయకుడివి ఎలా అవుతావులే" అంటూ మర్మగర్భంగా నవ్వింది.

ఫణి అసహనంగా, "నీతో వాదించడానికి రాలేదు నేను. నాతో నీకేమీ శత్రుత్వం లేదు కదా! అన్యాయంగా నా జీవితాన్ని ఎందుకు నాశనం చేశావు?" అన్నాడు.

ఐశ్వర్య అతనివంక విస్మయంగా చూసింది. "అవును ... నీతో శత్రుత్వం ఉంది. నువ్వు నా ఆగర్భశత్రువువి. నేను పుట్టిన వెంటనే 'ఆడపిల్లా!' అని ముఖం మాడ్చుకున్న నాన్న ... నా మీద పెత్తనం చెలాయించడంలో నాన్నతో పోటీ పడిన తమ్ముడూ ... నేను ప్రేమపెళ్లి చేసుకోవాలనుకుంటున్నానని చీటీ రాసిపెడితే, నా మాట పెడచెవిని పెట్టి, నన్ను పెళ్లి చేసుకున్నవాడూ ... నా అవసరం తీరాక నా నుండి పారిపోయిన ప్రేమికుడూ ... నేను పుట్టినప్పటినుండి నన్ను నియంత్రించిన

"మీరా ..! ఎలా ఉన్నారు? కూర్చోండి" అంటూ వరండాలో ఉన్న కుర్చీని చూపించింది ఐశ్వర్య. ఫణి నిదానంగా కుర్చీలో కూర్చున్నాడు. ఉపోద్ఘాతం ఏమీ లేకుండానే "ఓ విషయం క్లియర్‌గా చెప్పు. అంత తెగింపు ఉన్నదానివి, అసలు పెళ్లిచూపులకు ఎందుకు ఒప్పుకున్నావ్? నాలాంటివాడి జీవితాన్ని నాశనం చేసే బదులు, ఆ లేచిపోయేదేదో పెళ్లిచూపులకి ముందే పోయి ఉండాల్సింది. నాలాంటి అమాయకుడ్ని ఎందుకీ రొంపిలోకి లాగేవు?" అన్నాడు ఆక్రోశంగా.

వాళ్లందరూ నీలో ఉన్నారు. పడగలు వేయి ఉన్నా పాము ఒక్కటే! మీ మగాళ్లంతా ఒకే కుమ్మరంలో కాల్చిన కుండలు ..." ఐశ్వర్య మాటలు మబ్బుల్లేని ఉరుముల్లా వినిపించాయి.

ఇప్పుడు ఫణి కళ్లకి ఆమె పోటెత్తిన వరద గోదావరిలా కనిపించింది. ఆ షాక్ నుండి తేరుకోవడానికి కొంత సమయం పట్టింది కూడా. కుర్చీలోంచి లేవబోతూ తడారిపోయిన పెదాలను తడుపుకోవడానికి నాలుకను బయటకు చాపేడు.

అప్పటికే అది రెండుగా చీలిపోయి ఉంది.

---

**రచయిత మొబైల్: 91773 03231**

ఫుడ్ కోర్ట్

## రైస్ కట్‌లెట్



### కావలసిన పదార్థాలు

వండిన రైస్ - 2 కప్పులు, ఉల్లిపాయలు - 2, కొత్తిమీర - 1 కట్ట, క్యారెట్ - 1, బీట్ రూట్ - 1 (చిన్నది), ఆలూ - 1, శనగపిండి - 3 టీ స్పూన్లు, బ్రెడ్ - 4 స్లయిస్‌లు, నెయ్యి - 1 టీ స్పూను, పచ్చిమిర్చి - 3, కారం - 1 టీ స్పూను, ఉప్పు - రుచికి తగినంత, గరం మసాల - అర టీ స్పూను, టమోటా జూస్ - 4 టీ స్పూన్లు, కార్న్ ఫ్లోర్ - 2 టీ స్పూన్లు, నూనె - కాల్చడానికి సరిపడా.

### తయారుచేసే విధానం

ఒక వెడల్పాటి పెద్ద పాత్రలో కొద్దిగా నీరు, నెయ్యి వేయాలి. తర్వాత రైస్‌తో పాటు సన్నగా తరిగిన కూరగాయలు, ఉడికించి మెదిపిన ఆలూ, నానబెట్టి పిండిన బ్రెడ్, టమోటా జూస్, కారం, శనగపిండి, కార్న్‌ఫ్లోర్, ఉప్పు, గరం మసాల వేసి ముద్ద చేసుకోవాలి. తర్వాత చిన్న చిన్న ఉండలు చేసుకుని అరచేతిపైన చేత్తోనే ఒత్తి పెనంపైన రెండు వైపులా దోరగా కాల్చుకోవాలి. వేడి వేడిగా టమోటా కెచప్‌తో తింటే బాగుంటాయి.

# టేస్టీ టేస్టీ స్నాక్స్



## రైస్ పకోడి

### కావలసిన పదార్థాలు

అన్నం - 2 కప్పులు, శనగపిండి - అరకప్పు, పచ్చిమిర్చి తరుగు - 1 టీ స్పూను, ఉల్లి తరుగు - అరకప్పు, ధనియాల పొడి - 2 టీ స్పూన్లు, జీరా పొడి - 1 టీ స్పూను, కారం, సోంపు, వాము - అర టీ స్పూను చొప్పున, ఉప్పు - రుచికి తగినంత, కొత్తిమీర తరుగు - అరకప్పు, ఇంగువ - చిటికెడు, నూనె - వేగించడానికి సరిపడా.

### తయారుచేసే విధానం

నూనె తప్పించి తక్కిన పదార్థాలన్నీ ఒక లోతైన వెడల్పాటి బౌల్‌లో వేసి తగినంత నీరు కలుపుతూ ముద్ద చేసుకోవాలి. తర్వాత చిన్న చిన్న ఉండలుగా చేసి నూనెలో దోరగా వేగించాలి. వేడివేడిగా టమోటా కెచప్‌తో తింటే బాగుంటాయి.

## బ్రెడ్ కట్‌లెట్

### కావలసిన పదార్థాలు

బ్రెడ్ స్లయిస్‌లు - 2, ఉడికించి, మెదిపిన ఆలూ - 3, ఉప్పు, కారం, గరం మసాల పొడి - అర టీ స్పూను చొప్పున, పసుపు - పావు టీ స్పూను, ఉల్లి తరుగు - 1 టేబుల్ స్పూను, కొత్తిమీర తరుగు - 2 టేబుల్ స్పూన్లు, నూనె - వేగించడానికి సరిపడా. బ్రెడ్ పొడి/గసగసాలు - అరకప్పు, మైదా - 1 టేబుల్ స్పూను.

### తయారుచేసే విధానం

బ్రెడ్ స్లయిస్‌లను నీటిలో 30 సెకన్లు ఉంచి వెంటనే తీసి పిండేయాలి. తర్వాత ఒక పాత్రలో మిగతా పదార్థాలతో పాటు (నూనె తప్పించి) వేసి ముద్ద చేసుకోవాలి. దళసరిగా చపాతీలా రోల్‌గా వత్తుకుని (పిల్లలు ఇష్టపడే) షేపులో కట్ చేసుకోవాలి. వీటిని మైదా జారులో ముంచి బ్రెడ్ పొడి లేదా గసగసాలు అద్ది నూనెలో దోరగా వేగించాలి.





## పొటాటో రోల్స్

### కావలసిన పదార్థాలు

ఉడికించి, మెదిపిన బంగాళదుంపలు - 4, మైదాపిండి - అరకప్పు, జీరా పొడి - 1 టీ స్పూను, పచ్చిమిర్చి తరుగు - 1 టీ స్పూను, బేకింగ్ పౌడర్ - అర టీ స్పూను, ఉప్పు, మిరియాలపొడి - రుచికి తగినంత, బొంబాయి రవ్వ - 2 టేబుల్ స్పూన్లు, నూనె - వేగించడానికి సరిపడా.

### తయారుచేసే విధానం

రవ్వ, నూనె తప్పించి మిగతా పదార్థాలన్నీ ఒక వెడల్పాటి పాత్రలో వేసి ముద్దలా చేసుకోవాలి. తర్వాత చిన్నచిన్న ఉండలు చేసుకుని, పొడుగ్గా (ఒవెల్ షేప్‌లో) రోల్స్ చేసుకుని రవ్వలో దొర్లించాలి. ఒక్కొక్క రోల్‌ని నూనెలో వేసి, ఒక మోస్తరు మంట పైన దోరగా వేగించి తీసేయాలి. టమోటా కెచప్ వీటికి మంచి కాంబినేషన్.






## రంగులు వేయండి



## విలువ ఎంత?




## ఏది భిన్నం?







## మీకు తెలుసా!

1. ఆక్టోపస్ పిల్లలు పుట్టినప్పుడు ఒక సెంటీమీటరు కంటే చిన్నగా ఉంటాయి.
2. అమెరికాలోని మాడిసన్ నగరంలో ఓ లెక్కల టీచర్ దగ్గరుండే ఒక పంది 12 వరకూ గుణింతాలను గుర్తుపెట్టుకుని, నోటితో రాసిందట.
3. ఈగలకు చెవులు ఉండవు.
4. 'టామ్ అండ్ జెర్రీ' కార్టూన్ పాత్రలకు మొదట పెట్టిన పేర్లు 'జాస్పర్ అండ్ జిన్క్స్'



## కుండ కోరిక

ఒక కుమ్మరి కుండలు తయారుచేస్తున్నాడు. ఓర్పుతో, నేర్పుతో మట్టిముద్దలను కుండల ఆకృతిలో మలిచాడు. వాటిని కాల్చడానికి ఏర్పాట్లుచేశాడు. అప్పటికే కాలుతున్న కొన్ని కుండలను చూసి పచ్చికుండల్లో ఒకదానికి చాలా భయం వేసింది.

"అమ్మో! ఒళ్లు కాలిపోవడమే? వద్దు. దయచేసి నన్ను కాల్చొద్దు. నన్నిలా వదిలేయ్. సుఖంగా ఉన్న ప్రాణాన్ని దుఃఖాన పెట్టకు. నాకు భయంగా ఉంది" అని ఆ కుండ కుమ్మరిని దీనంగా బతిమాలింది.

కుమ్మరి "జీవితంలో తొలిదశలో కష్టపడితే తర్వాత జీవితాంతం హాయిగా ఉండొచ్చు. ఇప్పుడు కష్టమని భావించి సోమరిగా ఇలా ఉండిపోతే నీ జీవితం వృథా అవుతుంది. సమాజానికి ఉపయోగపడక వ్యర్థమైపోతావు" అంటూ ఎన్నో విధాలా నచ్చజెప్పాడు. అయినా కుండ వినకుండా మొండికేసింది. సరే... అంతలా అడుగుతోంది పోనిమ్మని, ఆ కుండని వదిలేసి మిగిలిన కుండలను ఆవంలో పెట్టాడు కుమ్మరి.

ఆవంలో కాలుతున్న కుండలను చూసి, తనకా బాధ తప్పినందుకు సంతోషపడింది పచ్చి కుండ.

బాగా కాలిన ఎర్రని, నల్లని కుండలన్నీ రెండు రోజుల్లోనో అమ్ముడుపోయాయి. ఎవరూ కొనేవారు లేక పచ్చి కుండ మాత్రం ఆరుబయట ఆవరణలో అలా ఉండిపోయింది. కుమ్మరి కొన్ని కుండల్లో నీళ్లు నింపాడు. కొన్ని కుండీలలో మొక్కలు నాటాడు. తనకు ఆ బరువులు లేనందుకు ఆనందించింది పచ్చికుండ. ఇలా ఉండగా ఓరోజు కుండపోతగా వర్షం కురిసింది. కాల్చిన కుండలు, కుండీలు దృఢంగా ఉంటే, పచ్చికుండ మాత్రం మెల్లమెల్లగా కరిగి మట్టిలో కలిసిపోసాగింది. తన ఆకృతిని, ఉనికిని పూర్తిగా కోల్పోయింది. కుమ్మరి మాటల్లో అంతరార్థం దానికి ఆ చివరిక్షణంలో అర్థమైంది. కానీ అప్పటికే జీవితం చేజారిపోయింది.

పిల్లలూ, అమ్మనాన్నలు చెప్పినట్టు కష్టపడి చదవకపోతే, పెద్దయ్యాక ఆ పచ్చికుండలాగే మీరూ కష్టాలు అనుభవించాల్సి వస్తుంది. ఇప్పుడు ఇష్టంతో కష్టపడి చదివితే, పెద్దయ్యాక జీవితం బాగుంటుంది.








# రికార్డుల 'గగనం'

ఈ బుడ్డోడి పేరు గగన్ సతీష్. వయసు ఆరేళ్లు. చూసేందుకు బక్కపలుచగా ఉన్నా, మనోడి సూపర్ టాలెంట్‌కు గిన్నీస్ రికార్డులే బద్దలయ్యాయి. మూడున్నర ఏళ్ల వయసు నుంచే గగన్‌కు లింబో స్కేటింగ్ (అతితక్కువ ఎత్తులో అమర్చిన కర్రల కింద నుంచి, వాటికి తగలకుండా శరీరాన్ని వంచి స్కేటింగ్ చేస్తూ వెళ్లడం) అంటే చాలా ఇష్టం. ఆ ఇష్టాన్ని గ్రహించిన గగన్ తల్లిదండ్రులు, ఆ వయసులోనే అతన్ని స్కేటింగ్ శిక్షణా కేంద్రంలో చేర్చారు. శిక్షణలో ఆరితేరిన ఈ బుడత ఒకేసారి ఏకంగా 39 కార్ల కింద నుంచి లింబో స్కేటింగ్ చేసి గిన్నీస్ వరల్డ్ రికార్డు సాధించేశాడు. 'వరల్డ్ అమేజింగ్ రికార్డ్స్', 'వరల్డ్ రికార్డ్స్ ఇండియా' లోనూ పేరు నమోదు చేసుకున్నాడు. అంతేనా త్వరలో 100 కార్ల కింద నుంచి లింబో స్కేటింగ్ చేసి, తన రికార్డును తానే తిరగరాస్తానని ఛాలెంజ్ చేస్తున్నాడు గగన్.




పదాలు కనుక్కోండి

moon, boat, crab, deer, cloud, chair

| | | | | | |
|---|---|---|---|---|---|
| j | o | w | t | r | a |
| m | c | d | q | c | r |
| o | r | e | b | l | i |
| o | a | e | o | o | a |
| n | b | r | a | u | h |
| s | v | o | t | d | c |

ఒళ్లంతా ఎర్రని ఈకలతో, పీక్కుతినేలా చూస్తున్న ఈ గద్ద పేరు 'బీయర్డ్ వల్చర్' (గడ్డం గద్ద). దీని మెడ పైన ఉండే వెంట్రుకలు చూసేందుకు గుబురుగా గడ్డంలా ఉండడంతో దీనికా పేరు వచ్చింది. ఎత్తయిన కొండలపైన  గూడు కట్టుకుని నివసించే ఇవి దాదాపు ఎముకలను (వీటి ఆహారంలో 70 శాతానికి పైగా) మాత్రమే తిని బతుకుతాయి. మగ పక్షుల కంటే ఆడపక్షులే ఆకారంలో కొంచెం పెద్దగా ఉంటాయి. యూరప్, ఆఫ్రికా, భారత ఉపకండపు దేశాల్లో నివసించే ఇవి, ప్రస్తుతం అంతరించిపోయే స్థితిలో ఉన్నాయి.







## మంచి పద్యం

**ఉన్న తావు వదలి ఊరూరు దిరిగిన**
**కన్నదేమి నరుడు గ్రాసమునకు**
**తన్నులోను జూడ తమమెల్ల వీడును**
**విశ్వదాభిరామ వినుర వేమ**

భావం: ఉన్న చోటును విడిచి తీర్థయాత్రలు చేసినంత మాత్రాన ఉపయోగం ఉండదు. తన గురించి తాను తెలుసుకుంటే చాలు... అజ్ఞానం తొలగిపోతుంది.

జవాబులు
విలువ ఎంత? 23, 12, 6, 7, 84
ఏది భిన్నం? 3వ చిత్రం



# అనుగ్రహం

**11 - 17 జూన్ 2017**

**డాక్టర్ పి.ఎ. రామన్**



**మేషం**

### అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం

ఇంట్లో ప్రశాంతత నెలకొంటుంది. ప్రేమానుబంధాలు బలపడతాయి. వాయిదా పడిన పనులు పూర్తి చేస్తారు. బాధ్యతలు స్వయంగా చూసుకోవాలి. శనివారం నాడు ఆధిపత్యాన్ని ప్రదర్శించవద్దు. మీ గౌరవానికి భంగం కలగకుండా మెల గండి. ఆదాయానికి తగ్గట్టుగా ఖర్చులుంటాయి. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. రుణయత్నం ఫలిస్తుంది. ప్రయాణం కలిసివస్తుంది.



**వృషభం**

### కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు

మీ యత్నాలకు పరిస్థితులు అనుకూలిస్తాయి. సమర్థతతో రాణిస్తారు. మీ మాటకు స్పందన వస్తుంది. వ్యూహాత్మకంగా వ్యవహరిస్తారు. ఆది, సోమ వారాల్లో పనులు మందకొడిగా సాగుతాయి. ఊహించిన ఖర్చులే ఉంటాయి. డబ్బుకి ఇబ్బంది ఉండదు. సన్నిహితులకు సాయం అందిస్తారు. విద్యార్థుల కృషి ఫలిస్తుంది. పోగొట్టు కున్న పత్రాలు లభ్యమవుతాయి. ఉద్యోగ బాధ్యతలలో మార్పులుంటాయి.



**మిథునం**

### మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు

ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. రుణాలు స్వీక రిస్తారు. పనుల ప్రారంభంలో ఆటంకాలు ఎదుర్కొంటారు. మంగళ, బుధ వారాల్లో శ్రమాధిక్యత తప్ప ఫలితం ఉండదు. మీపై శకునాల ప్రభావం అధికం. ఆత్మీయులు మీకు చేయూతనిస్తారు. ఆందోళన తొలగుతుంది. ముఖ్యమైన పత్రాలు అందుతాయి. ఉద్యోగ యత్నంలో నిరుత్సాహం వీడండి. త్వరలో విజయం సాధిస్తారు.



**కర్కాటకం**

### పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష

మనోధైర్యంతో వ్యవహరించండి. కొన్ని అవకాశాలు చేజారినా పట్టించుకోవద్దు. ఖర్చులు విపరీతం. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. అయినవారి మాటతీరు బాధిస్తుంది. ఆది, గురు వారాల్లో పనులు సాగవు. ఆప్తుల సాయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది. ఆరోగ్యం జాగ్రత్త. అతిగా ఆలో చించవద్దు. ఒప్పందాల్లో మెలకువ వహించండి.



**సింహం**

### మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం

సంప్రదింపులు ఫలిస్తాయి. వ్యవహార దక్షతతో రాణి స్తారు. కొంత డబ్బు అందుతుంది. ఖర్చులు భారమని పించవచ్చు. నగదు స్వీకరణ, చెల్లింపులలో జాగ్రత్త. పనులు వేగవంతమవుతాయి. స్వల్ప అస్వస్థతకు గురవుతారు. మీ బాధ్యతలు ఇతరులకు అప్పగించవద్దు. కొత్త విషయాలు గ్రహిస్తారు. దళారులను విశ్వసించవద్దు. ఉద్యోగస్తుల కృషి ఫలిస్తుంది.



**కన్య**

### ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు

కొన్ని సమస్యల నుంచి బయటపడతారు. ఇంట్లో ప్రశాంతత నెలకొంటుంది. ఖర్చులు అధికంగా ఉంటాయి. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. గుట్టుగా యత్నాలు సాగించండి. కుటుంబ విషయాలు వెల్లడించవద్దు. గురు, శుక్ర వారాల్లో పనులు అస్తవ్యస్తంగా సాగుతాయి. పరిచయస్తుల రాక ఇబ్బంది కలిగి స్తుంది. విలువైన వస్తువుల పట్ల శ్రద్ధ అవసరం. సహోద్యోగులతో జాగ్రత్త.



**తుల**

### చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు

శుభవార్త వింటారు. అవకాశాలను సద్వినియోగం చేసుకుంటారు. పనులు వేగవంతమవుతాయి. ఖర్చులకు అదుపు ఉండదు. విలాసాలకు వ్యయం చేస్తారు. ఆప్తు లను కలుసుకుంటారు. దంపతుల మధ్య అన్యోన్యత నెలకొంటుంది. పిల్లల చదువుల పట్ల శ్రద్ధ వహిస్తారు. ఒప్పందాలకు అనుకూలమైన కాలం. మీ స్తోమతకు మించి హామీలివ్వవద్దు.



**వృశ్చికం**

### విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ

వ్యవహారాలు మీ ఇష్టానుసారమే జరుగుతాయి. ఆందో ళన తొలగి కుదుటపడతారు. రుణయత్నం ఫలిస్తుంది. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. విమర్శలకు దీటుగా స్పందిస్తారు. అయినవారితో సఖ్యత నెలకొంటుంది. మీ జీవిత భాగస్వామి వైఖరిలో మార్పు సంభవం. శుభకార్యానికి యత్నాలు సాగిస్తారు. ఒక సమాచారం ఆలోచింపచేస్తుంది. పదవులు, సభ్యత్వాలు స్వీకరిస్తారు.



**ధనుస్సు**

### మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం

ఈ వారం ఆశాజనకమే. అన్నింటా మీదే పైచేయి. వృత్తి రేకులు సన్నిహితులవుతారు. ఖర్చులు అధికం. విలాస వస్తు వులు అమర్చుకుంటారు. పరిచయాలు ఉన్నతికి దోహద పడతాయి. పనులు, బాధ్యతలు స్వయంగా చూసుకోండి. ఎవరినీ అతిగా విశ్వసించవద్దు. అప్రయత్నంగా అవకాశాలు కలిసివస్తాయి. ఇంటి నిర్మాణా లకు అనుమతులు మంజూరవుతాయి. శుభకార్యం నిశ్చయమవుతుంది.



**మకరం**

### ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు

ఆర్థికస్థితి సంతృప్తికరం. రుణ బాధలు తొలగుతాయి. చక్కని ప్రణాళికలతో ముందుకు సాగుతారు. ఆది, సోమ వారాల్లో కావలసిన వ్యక్తుల కలయిక అనుకూలించదు. విద్యార్థుల కృషి ఫలిస్తుంది. శుభకార్యానికి హాజరవుతారు. బంధుత్వాలు బలపడతాయి. సన్నిహితులతో ఉల్లాసంగా గడుపుతారు. పెట్టుబడులకు అనుకూలమైన కాలం. వాణిజ్య ఒప్పందాలు కుదుర్చుకుంటారు.



**కుంభం**

### ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు

అంచనాలు ఫలిస్తాయి. సమయోచిత నిర్ణయాలు తీసు కుంటారు. అవకాశాలను తక్షణం వినియోగించుకోండి. సలహాలు అడగవద్దు. పనులు సకాలంలో పూర్తి కాగలవు. దంపతుల మధ్య అన్యోన్యత నెలకొంటుంది. కుటుంబ విషయాల పట్ల శ్రద్ధ వహిస్తారు. ఖర్చులు అధికం. మంగళ, బుధ వారాల్లో అప్రమత్తంగా ఉండాలి. అభియోగాలు, విమర్శలు ఎదుర్కొంటారు.



**మీనం**

### పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి

ఆర్థిక లావాదేవీలు సంతృప్తినిస్తాయి. ధనలాభం పొందు తారు. పెట్టుబడులు, పొదుపు పథకాలకు అనుకూలం. పెద్దమొత్తంలో ధనసహాయం తగదు. మీ మాటకు స్పందన వస్తుంది. కొన్ని విషయాల్లో మీ జోక్యం అనివార్యం. గురు, శుక్ర వారాల్లో బాధ్యతలు ఇతరులకు అప్పగించవద్దు. మీ బలహీనతలు అదుపులో ఉంచుకోండి. విద్యార్థులకు విదేశీ విద్యావకాశం లభిస్తుంది.

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## కిడ్నీ స్టోన్స్ (మూత్రపిండాలలో రాళ్ళు) నివారణ సులభం




**డా. శ్రీకాంత్ మోర్లావర్**
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్


ప్రస్తుత పరిస్థితులలో 'కిడ్నీ స్టోన్స్' సమస్య చాలా ఎక్కువ మంది జనాభాను వేధిస్తున్న సమస్య. ఇది కొందరిలో ఎన్ని రకాల జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ తరచూ ఏర్పడే విధంగా ఉంటూ, - కొన్నిసార్లు వీటిని శస్త్రచికిత్స ద్వారా తొలగించినప్పటికీ తిరిగి అవి మరలా ఏర్పడుతుంటాయి. ఇలా తరచూ కిడ్నీలో రాళ్ళు ఏర్పడినట్లయితే అవి కిడ్నీని పూర్తిగా దెబ్బతీసి, కిడ్నీ యొక్క వైఫల్యానికి దారి తీసే ప్రమాదం ఉంటుంది. అయితే ఈ 'కిడ్నీ స్టోన్స్' బాధితులు ఎలాంటి ఆందోళన చెందనవసరం లేదు. కాన్స్‌టిట్యూషనల్ హోమియో వైద్య విధానంలో అందబడే చికిత్స ద్వారా కిడ్నీలో రాళ్ళను పూర్తిగా తగ్గించడమే కాకుండా మరలా అవి తిరగబెట్టని విధంగా శాశ్వత పరిష్కారం లభించే అవకాశం ఉంది.

సాధారణంగా మన శరీరంలో మూత్రపిండాలు అత్యంత కీలక పాత్ర పోషిస్తుంటాయి. ఇవి రక్తాన్ని వడపోసి చెడు పదార్థాలను, అదనపు నీటిని మూత్రం ద్వారా బయటకు పంపించి, శరీరంలోని లవణాల సమతుల్యతను కాపాడుతాయి.

ఎప్పుడైతే మూత్రంలో అధికంగా ఉండే లవణాలు స్ఫటిక రూపాన్ని దాల్చి ఘనస్థితికి చేరుతాయో అప్పుడు కిడ్నీలో రాళ్ళు ఏర్పడతాయి. మూత్రవ్యవస్థలో ప్రధాన భాగమైన మూత్రపిండాలు, మూత్రనాళాలు, మూత్రకోశంలో ఎక్కడైనా ఈ రాళ్ళు ఏర్పడవచ్చు.



**Kidney Stones**

**కిడ్నీలో రాళ్ళు - రకాలు:** (1) క్యాల్షియం స్టోన్స్: వీటిని ఎక్కువగా 20 నుండి 30 సం॥ల మధ్య వయస్సువారిలో గమనించవచ్చు. క్యాల్షియంతో పాటు క్యాల్షియం ఫాస్పేట్, కార్బొనేట్ వంటి రకాలు చూడవచ్చు. (2) ఆక్జలేట్ స్టోన్స్: వీటిని చాలా ఎక్కువ శాతం మందిలో గమనించవచ్చు. పాలకూర, బీట్‌రూట్, బ్లాక్‌టీ, చాక్లెట్లు, గోధుమపొట్టు, నట్స్, స్ట్రాబెర్రీ మొదలైన వాటిలో ఆక్జలేట్‌లు పుష్కలంగా ఉంటాయి. వీటిని ఎక్కువ మోతాదులో తీసుకోవటం వలన ఆక్జలేట్ స్టోన్స్ ఏర్పడే అవకాశం ఉందని అధ్యయనాలు చెబుతున్నాయి కాబట్టి ఆక్జలేట్ స్టోన్స్ ఉన్నవారు వీటిని తీసుకోకపోవటం మంచిది. (3) సిస్టీన్ స్టోన్స్: ఇవి ముఖ్యంగా వంశపారంపర్యత వలన ఏర్పడతాయి. (4) స్ట్రువైట్ స్టోన్స్: ఇవి ముఖ్యంగా మూత్రకోశ ఇన్‌ఫెక్షన్‌లు ఉన్నవారిలో ఎక్కువగా ఏర్పడతాయి. (5) **Uric Acid Stones**: వీటిని పురుషులలో ఎక్కువగా గమనించవచ్చు. గౌట్ లేదా కీమోథెరపీ చేయించుకున్న వారిలో యూరిక్ యాసిడ్ స్టోన్స్ వచ్చే అవకాశం ఉంది.

**కారణాలు:** మారుతున్న జీవనశైలి, ఆహారపు అలవాట్లు మరికొన్ని ఇతర కారణాల వలన కిడ్నీలో రాళ్ళు ఏర్పడే అవకాశం ఉంది. ముఖ్యంగా అధిక మోతాదులో ఆక్జలేట్స్, క్యాల్షియం, యూరిక్ యాసిడ్, సిస్టీన్ వంటి కరగని పదార్థాలు మూత్రం ద్వారా విసర్జించటం వలన కిడ్నీలో రాళ్ళు ఏర్పడతాయి. కొందరిలో మూత్రకోశ ఇన్‌ఫెక్షన్‌లు, మూత్రమార్గంలో అడ్డంకులు, హైపర్ పారా థైరాయిడిజమ్, ఒకేచోట ఎక్కువసేపు కూర్చుని పనిచేయటం, శరీరంలోని విటమిన్-**A** శాతం తగ్గిపోవడం వంటి అంశాలన్నీ కిడ్నీలో రాళ్ళను ప్రేరేపించే అంశాలు. ముఖ్యంగా ఆహారంలో మాంసకృత్తులు మరియు సోడియం (ఉప్పు) అధిక మోతాదులో తీసుకోవడం, సాధారణం కంటే తక్కువ మోతాదులో (>1.5 లీటర్లు) నీటిని సేవించడం మరియు కొన్ని ఇతరత్రా జబ్బుల వలన ముఖ్యంగా హైపర్ కాల్సీమియా, చిన్నప్రేగు ఆపరేషన్‌లు, రీనల్ ట్యూబులార్ అసిడోసిస్, కొన్ని జన్యుపరమైన అంశాలు, ఆస్ప్రిన్, అంటాసిడ్స్, విటమిన్-C వంటి కొన్ని మందులు మరియు క్యాల్షియం సప్లిమెంట్ల వలన కూడా కిడ్నీలో రాళ్ళు ఏర్పడే అవకాశం ఎక్కువగా ఉంటుంది.

**లక్షణాలు:** విపరీతమైన నడుము నొప్పి, కడుపునొప్పి, వాంతులు, మూత్రంలో మంట వంటివి కిడ్నీ స్టోన్స్ ప్రధాన లక్షణాలు. కొందరిలో మూత్రపిండాలలో రాళ్ళు ఏర్పడటం వలన ఏదో ఒకవైపు నడుమునొప్పి రావడం, నొప్పితో పాటు జ్వరం, మూత్రంలో మంట వంటి లక్షణాలను గమనించవచ్చు. మరికొందరిలో మూత్రనాళాలలో కూడా రాళ్ళు ఏర్పడతాయి. దీని వలన నడుము మరియు ఉదరం మధ్య భాగంలో నొప్పి ఏర్పడి - ఈ నొప్పి క్రమేణా పొత్తికడుపుకు, గజ్జలకు లేదా కాళ్ళలోకి పాకడం జరుగుతుంది. నొప్పితో పాటు వాంతులు, జ్వరం, మూత్రంలో మంట, రక్తం, చీము కూడా కనిపిస్తుంటాయి. మరికొందరిలో కండరముల బిగువు, నడుము-ఉదరం మధ్యభాగంలో వాపు, కడుపుబ్బరం మొ॥ లక్షణాలను గమనించవచ్చు. కొన్నిసార్లు ఎటువంటి లక్షణాలు కనపడకుండా మరియు నొప్పి లేకుండా కూడా కిడ్నీలో రాళ్ళు ఉండవచ్చు. వీటినే 'సైలెంట్ స్టోన్స్' అని అంటారు.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** ఎక్కువ మోతాదులో నీటిని సేవించడం అనగా - రోజుకు కనీసం 2-3 లీటర్ల నీరు తీసుకోవటం మరియు రోజువారీ ఆహారంలో భాగంగా ఉప్పు 5 గ్రాములు మరియు మాంసకృత్తులు 170-230 గ్రాములు మించకుండా చూసుకోవాలి. విటమిన్ 'సి' మరియు క్యాల్షియం సప్లిమెంట్‌లు, మాత్రలు ముఖ్యంగా వైద్యుని సలహా పాటించకుండా యథేచ్ఛగా తీసుకోకూడదు. రోజువారీ ఆహారంలో 1,000-1,200 మిల్లీగ్రాముల క్యాల్షియం ఉండేట్లుగా చూసుకోవాలి. శీతలపానీయాలను సేవించడం మానివేయాలి.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్‌లో జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ వైద్య పద్ధతిలో కిడ్నీలో రాళ్ళను సంపూర్ణంగా తొలగించవచ్చు. వ్యాధి లక్షణాలతో పాటు మానసిక మరియు శారీరక లక్షణాలు మొ॥ అంశాలను పరిగణనలోకి తీసుకున్న తదుపరి చికిత్స అందించడం జరుగుతుంది. కొందరిలో వీటిని శస్త్రచికిత్స ద్వారా తొలగించిన తరువాత కూడా, 50% వరకు కిడ్నీలో రాళ్ళు మళ్ళీ ఏర్పడే అవకాశం ఉంది. కానీ 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్' ట్రీట్‌మెంట్ ద్వారా కిడ్నీలలోని లవణాల సమతుల్యతను కాపాడి - కిడ్నీల పనితీరును మెరుగుపరచటంతో మళ్ళీ ఈ రాళ్ళు ఏర్పడకుండా పూర్తిగా ఈ వ్యాధి నుండి బయటపడే అవకాశం ఉంది.

ADVT

## మరణించని సంగీతం

అరుణ్ సాగర్ - ఈ పేరు వినగానే పుట్టుకతోనే 'డెనిమ్' ధరించి పుట్టాడా అనిపించే అత్యాధునికుడు గుర్తొస్తాడు. అటు జర్నలిజంలో, ఇటు సాహిత్యంలో కొత్త ట్రెండ్ ప్రవేశ పెట్టిన అరుదైన జర్నలిస్ట్, అర్బన్ పోయట్ కళ్లముందు ఫ్లాష్ అవుతాడు. ఆ అక్షరాల వెంట కళ్ల పరుగులు తీస్తుంటే, హార్ట్ బీట్ స్పరున పెంచుతూ వడివడిగా దూకే జలపాతం లాంటి శైలికి, సంభ్రమాశ్చర్యాలకు లోను చేసే వాక్యనిర్మాణానికి, పద ప్రయోగాలకు, అలజడికి గురిచేసే భావజాలానికి ఫిదా అయిన వారెందరో. 'నా కవిత్వమంతా నా ఇన్స్పిరేషన్ .. నా, నా స్నేహితుల జీవితాల అనుభవాల రిఫ్లెక్షన్, స్పాంటేనియస్ రియాక్షన్' అని చెప్పే అరుణ్ కవిత్వం ఎన్ని కొత్త పుంతలు తొక్కిందో, వచనం అంతకంటే వినూత్నంగా సాగుతుంది. సొంత వేదన నుంచి సామూహికవేదన పలికేదాకా ప్రయాణించిన అరుణ్ సాగర్ ఇంకొంత కాలం ఉండి ఉంటే తెలుగు కవిత్వంలో ఇంకెన్ని విప్లవాత్మక మార్పులు వచ్చి ఉండేవో! ముతక వాసన కొట్టే భావాలకు, పండిపోయిన పద ప్రయోగాలకు ప్రత్యామ్నాయాలెన్ని చూపేవాడో అనిపిస్తాడు.

ఇప్పుడు అరుణ్ సాగర్ ముద్రితాలు, అముద్రితాలు, సోషల్ సైట్స్‌లో షేర్ చేసిన ఆర్టికల్స్, కవితలు ... ఆయన రచనలన్నీ ఒకదగ్గర కూర్చి ప్రచురించారు. సాహితీ మిత్రులు విశ్వేశ్వరరావు, అరుణ్ సోదరుడు జగన్ ఈ సంకలనాన్ని తీసుకొచ్చారు. తండ్రీ నిన్ను దలంచి... అని మొదలయ్యే ఈ గ్రంథం ఎక్స్ టిన్షన్ ప్రమాదంలో పడిన ఆదిమ జాతులు, వాటి సంస్కృతుల గురించి ఆర్ద్రంగా రాసిన దోడతిత్తివా అనే లైటప్ వరకు ... అరుణ్ సాగర్ అనే అక్షర సంద్రాన్ని, ఒడ్డున రాళ్లను వేగంగా తాకే కెరటాల్లాంటి అతని సృజనను పాఠకుల ముందుకు తెచ్చింది. 416 పేజీల ఈ పుస్తకం అరుణ్ అభిమానులకే కాదు, కవిత్వాన్ని ఇష్టంగా అనుసరించే పాఠకులకూ, అత్యాధునిక తెలుగు వచనాన్ని ఆరాధించే సాహితీ ప్రేమికులకూ ఓ మంచి కానుక అని చెప్పొచ్చు. కవి ప్రసాదమూర్తి అన్నట్టు ఇప్పటిదాకా అరుణ్ అక్షరాల్లోకి దిగని వారు ఇకనైనా ధైర్యం చేస్తే వేర్ వర్ యూ ఆల్ మై లైఫ్ అని కన్నీరుమున్నీరు అవడం ఖాయం.

**- కిరణ్ చర్ల**




**అరుణ్ సాగర్ - అక్షర శ్వాస**
**పేజీలు :** 416, **వెల :** రూ. 350
**ప్రతులకు :** సాహితీ మిత్రులు, 94906 34849

## భాష ఏదైనా సంఘర్షణ ఒక్కటే

భారతీయతంటేనే అనేక భాషలు, సంస్కృతుల సమ్మేళనం. కానీ, ఒకరి గురించి మరొకరికి తెలిసింది మాత్రం అతి స్వల్పం. విదేశీ సాహిత్యం తెలిసినంతగా ఇరుగు పొరుగు రాష్ట్రాల సాహిత్యం తెలియకపోవడం శోచనీయం. ఇందుకు కారణం అనువాద సాహిత్యం విస్తృతంగా రాకపోవడమే. తెలుగులో అతి కొద్ది అనువాదకుల్లో ఒకరు కాకాని చక్రపాణి. రాజ్యాంగంలోని ఎనిమిదో షెడ్యూలులో గుర్తించిన 21 భాషల కథలను తెలుగు పాఠకులకు అందించేందుకు, సుమారు 75 కథలను తెలుగులోకి తర్జుమా చేశారాయన. ఇస్మత్ చుగ్తాయ్(ఉర్దూ), న.పిచమూర్తి(తమిళం), సుదర్శన్ (హిందీ), ముల్కరాజ్ ఆనంద్ ... వంటి ప్రసిద్ధ రచయితల కథలున్నాయి. కథలతో పాటూ, ఆయా రచయితల పరిచయాలు ఇవ్వడం వల్ల ఆ భాషా సాహిత్యం గురించి మరింత తెలుసుకున్నట్లయ్యింది. ఈ కథలన్నీ చదివాక భాష ఏదైనా మానవ జీవితాల్లో సంఘర్షణ ఒకటేనని, సమాజంతో సంబంధం లేకుండా కథలుండవని అర్థమవుతుంది.

**- చందు తులసి**




**భారతీయ కథా భారతి** (అనువాద కథలు)
అనువాదం - కాకాని చక్రపాణి
**పేజీలు :** 800 **వెల :** 400
**ప్రతులకు :** 040 - 2326 4028

**కొత్త పుస్తకాలు**

## కాపురం కళకళలాడాలంటే...

దాంపత్యం సజావుగా సాగాలంటే భార్యాభర్తలు పాటించాల్సిన అంశాలేమిటో ఈ పుస్తకం బోధపరుస్తుంది. ముందుమాటలో డా.బి.వి.పట్టాభిరామ్ అన్నట్టు సంసారిక వ్యవహారాల్లో ఎప్పుడైనా చికాకు కలిగినప్పుడు ఇందులో అయిదారు పేజీలు చదివితే మనసుకు ఊరట కలుగుతుందనడంలో సందేహం లేదు. నవదంపతులకే కాదు, వయసుమళ్లిన వారి విభేదాల చిక్కుముడిల్ని సైతం విప్పదీసి కుటుంబాన్ని గాడిన పెట్టడానికి సహకరించే మంచి పుస్తకం. సలహా చెప్పడానికే వేల రూపాయల్ని వసూలు చేస్తున్న ఈ రోజుల్లో ఇలాంటి పుస్తకాల అవసరం ఎంతయినా ఉంది.

**- వాడ్రేవు వీరలక్ష్మీదేవి**




**వివాహాలు, విభేదాలు** (ఫ్యామిలీ కౌన్సిలింగ్)
డాక్టర్ గొడవర్తి సత్యమూర్తి
**పేజీలు :** 219, **వెల :** రూ.150
**ప్రతులకు :** 99483 35306

**ఇవీ వచ్చాయి**

**లేఖమాల** (హరిహరప్రియకు డాక్టర్ సంజీవదేవ్)
**సంకలనం :** ఎస్.వి. విశ్వనాథ భట్టు
**పేజీలు :** 166, **వెల :** రూ.166
**ప్రతులకు :** 092422 21506

**నవలాత్రయం**
**రచన :** ఇంద్రగంటి జానకీబాల
**పేజీలు :** 220, **వెల :** రూ.150
**ప్రతులకు :** నవోదయ, హైదరాబాద్

**సత్యవతి కథలు**
**పేజీలు :** 386, **వెల :** రూ.270
**ప్రతులకు :** విశాలాంధ్ర

**విహారి కథలు**
**పేజీలు :** 192, **వెల :** రూ.140
**ప్రతులకు :** నవచేతన పబ్లిషింగ్ హౌస్

**బతుకమ్మ** (కథల సంపుటి)
**రచన :** కూతురు రాంరెడ్డి
**పేజీలు :** 180, **వెల :** రూ.120
**ప్రతులకు :** 90004 15353

**కవుకు దెబ్బలు** (కథలు)
**రచన :** పాలకొల్లు రామలింగస్వామి
**పేజీలు :** 132, **వెల :** రూ.130
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

**నీతిమాలిన వాళ్ళ నీతికథలు**
**రచన :** మోహనరావు దురికి
**పేజీలు :** 176, **వెల :** రూ.100

**ఆదర్శతత్త్వవేత్త, మహామహోపాధ్యాయ కొత్త సచ్చిదానందమూర్తి**
**సంకలనం :** ఆచార్య కె. రఘునాథ్, ఆచార్య కె. రమేశ్
**పేజీలు :** 232, **వెల :** రూ.110
**ప్రతులకు :** సాహితి ప్రచురణలు 0866 2436642/43

**ప్రేమ - పెట్టుబడి**
**మూలం :** మేరీ గేబ్రియల్, **అనువాదం :** ఎం.పార్థసారథి
**పేజీలు :** 552, **వెల :** రూ.350
**ప్రతులకు :** ప్రజాశక్తి బుక్‌హౌస్, 0866 2577533

